Photo by Brahm Dev



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముక్కు మీద గుద్దితే...

పంపినవారు:
ఎస్. శారదాదేవి - కదిరి




జె. బి. మంఘారామ్ వారి



ఎనర్జి
ఫుడ్
బిస్కత్తులు

రేపటి పౌరులకు పుష్టి నిచ్చునవి



**J. B. MANGHARAM & CO.**
GWALIOR



© JB/41

# జె. బి. మంఘారామ్ అండ్ కో.,
## గ్వాలియర్.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు

ఫిలిం పరిశ్రమ
సేవకు
చిహ్నము




లెస్సీస్

విజయ స్టూడియోస్
వాహిని స్టూడియోస్
మదరాసు

## 'చందమామ' కు

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతి నెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

★

## చందాదారులకు మనవి

పైనెల చందమామలు యీ నెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందని వారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదుచేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

చందమామ పబ్లికేషన్సు,

వడపళని, మద్రాసు - 26

# అందమైన అమ్మాయి—మొరటు మృగం

అనగా అనగా ఒకప్పుడు...ఒక మృగం అందమైన ఒక అమ్మాయిని ప్రేమించింది. ఆ మృగం స్వరూపంలో ఎంత వికారంగా ఉన్నా, మధురమైన సరళ స్వభావం కలది. అమ్మాయి కూడ మృగాన్ని ప్రేమించిందని ఎవరైనా చెప్పగలరు.

అమ్మాయి తల్లి ఎంతగానో విలపించింది. "మృగమా నా అల్లుడు? నా కెంతమాత్రం ఇష్టం లేదు" అని వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది. "అదుగో! నిన్నే! ఊరుకో, ఊరుకో" అన్నాడు భర్త

"ఊరుకో, ఊరుకో అని అక్కడ కూర్చుని బాగానే అంటారు. మీవల్ల ఏమీ ప్రయోజనం లేదు" అని భార్య విసుక్కుంది.

ఇది జరిగిన తరువాత ఆ మృగం ఒక నాటి సాయంత్రం ప్యారిస్ మిఠాయిల బహుమతి టిన్ తీసుకవచ్చి, కాబోయే అత్తగారికి సమర్పించుకొంది. మిఠాయిలన్నీ ఆమె ఏమీ మిగల్చకుండా, అప్యాయంగా తిన్నది. మనసు మారిపోయింది. భర్తవంక తిరిగి "ఏమండీ! చూశారు! బాగా ఆలోచిస్తే, మృగం ఏమంత చెడ్డదిగా అనిపించడం లేదు. మంచి అభిరుచి కలది కూడ" అని ఆమె అన్నది.

తనకు తెలుసు నన్నట్టుగా ఆమె భర్త మందహాసం చేస్తూ తల ఊపాడు.




నీతి : ప్యారిస్ మిఠాయిల బహుమతితో మీరు ఎల్లప్పుడూ ఇతరులను సంతోషపెట్టవచ్చు

Parry's



ప్యారిస్ మిఠాయిలు ఎంతో రుచిగా ఉంటాయి. పరిశుద్ధమైనవి. పుష్టికరమైనవి కూడ. అవి విడిగాగాని రు 1.75 నుంచి రు 5/- వరకు అందమైన నగిషి డబ్బాలలోగాని లభిస్తాయి.

తయారి : ప్యారిస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్. మద్రాసు




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధి చెందినదిన్ని. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకింటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - మాచెర్ల - కర్నూలు - ఆదోని - తిరుపతి
కడప - హైదాబాద్ - బెంగళూరు - చిత్రదుర్గం - కంబమ్.


M.H.RAO



# భావి కోసం:

ఆతడనేక సాధనల నారియు తేరిన వృద్ధ మూర్తి వాడో తరుణుడు.
తన సాధన సంపత్తి నంతా తనయుని పరం చేసి, తదనంతరపు
తరానికి దఖలు చేస్తాడు తండ్రి, శిక్షకుడై, రక్షకుడై జీవితం చిలికి తీసిన
అనుభవాన్ని గోరు ముద్దలు చేసి కొడుకు కందిస్తాడు.
క్రమశః కొమరుడు జీవితం చవిచూస్తాడు. ప్రపంచపు పరిణామ
ప్రక్రియలో కర్మిష్ఠియై, నిర్మాతయై, నేటికై పాటు పడుతూ
రేపుకి రూపం పోస్తాడు. ఆ పాటికి లక్ష్యం, ఆ రేపటి రూపం. రవంత
వంతనశించిన లోకం, మరింత మోదం నిండిన లోకం.

నేడూ, నిన్నటివలెనే, మా ఉత్పత్తులు మీ
గృహాల శుభ్రతకీ, ఆరోగ్యానికీ, ఆనందానికీ ఉపకరిస్తాయి.
పైగా మా నేటి కృషికి మరొక లక్ష్యం .... రేపు -
రేపటి మీ పెరిగే జీవన ప్రమాణాలతో పెరిగే అవసరాలను
తృప్తిపరచడం. అందుకై మేము విస్తృత సేవా
సౌకర్యాలతో, కొత్త కొత్త ఊహలతో, కొత్త కొత్త
ఉత్పత్తులతో తయారుగా వుంటాము.

**నేడూ, రేపూ... హిందుస్థాన్ లీవర్ గృహములకు సేవ చేయుచున్నది.**

PR. 4-50 TL

# విజయా పిక్చర్స్, గాంధినగర్, విజయవాడ

(బ్రాంచి: గుంతకల్)

అందరకు మా హృదయపూర్వకమైన దీపావళి అభినందనలు

రాబోయే మా చిత్రాలు: —

## తెలుగు చిత్రాలు

1. పద్మశ్రీ ప్రొడక్షన్స్‌వారి ... వెంకటేశ్వర మహాత్యం

ఎన్. టి. రామారావు, సావిత్రి, శాంతకుమారి, జానకి, నాగయ్య మొదలైనవారు నటించినది.

2. సంగీతా ప్రొడక్షన్స్‌వారి ... మామకు తగ్గ అల్లుడు

రేలంగి, సావిత్రి, గిరిజ, రంగారావు మొదలైనవారు నటించినది.

3. ఆర్. ఆర్. పిక్చర్సువారి ... తెలుగు చిత్రం

ఎన్. టి. రామారావు, బి. సరోజాదేవి, జగ్గయ్య, ఇ. వి. సరోజ, గిరిజ మొదలైన వారు నటించినది. దర్శకత్వం: రామన్న.

4. విజయా ప్రొడక్షన్స్‌వారి ... ?

దర్శకత్వం: కె. వి. రెడ్డి, బి.ఎస్.సి (ఆనర్స్).

5. భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి ... మనోరమ (రాయలసీమకు మాత్రం)

కృష్ణకుమారి, బాలయ్య మొదలగువారు నటించినది. దర్శకత్వం: భాస్కరరావు.

6. ఎమ్. ఎ. వి. పిక్చర్సువారి ... ఆలుమగలు (రాయలసీమకు మాత్రం)

జానకి, జగ్గయ్య మొదలగువారు నటించినది. దర్శకత్వం: కృష్ణారావు.

## రాబోయే మా హిందీ చిత్రాలు

1. బహురూపియా .... వైజయంతీమాల, కిషోర్‌కుమార్ మొదలగువారు నటించినది.
2. ఏక్‌తా రాజా ఏక్‌తీ రాణీ .... కిషోర్‌కుమార్, నర్గీస్ మొదలగువారు నటించినది.
3. జ్వాల (టెక్ని - కలర్) .... మధుబాల, సునీల్‌దత్తు మొదలగువారు నటించినది.
4. చాచా జిందాబాద్ .... కిషోర్‌కుమార్, అనితగుహ, ఓంప్రకాష్ మొదలగు వారు నటించినది.

## ఇప్పుడు వేలాది జనులకు ప్రదర్శింపబడుతున్నది

1. రాజ్‌కమాల్స్ 'నవరంగ్' (టెక్ని-కలర్) ... ...

సంధ్య, మహీపాల్, మొదలైనవారు నటించినది. దర్శకత్వం: వి. శాంతారామ్.


చప్పుడు చెయ్యకండా తప్పరాకన్నం.
చస్తుంటే!
ఇన్ని గోడలు తవ్వాను గాని. ఇల్లాంటి గోడ ఎక్కడా చూడలేదు గునపమయినా వంగింది గాని, గోడ కొస్తయినా బెసగందే!


జరి పిచ్చివాళ్లలారా! ఈ గోడ దుర్గా బ్రాండు సిమెంటుతో కట్టింది తెలుసా?
BUJJAI
పరీక్ష చేయబడి ప్రశస్తమైనదిగ
ఋజువు పొందిన
దుర్గా బ్రాండు
పోర్టులెండ్ సిమెంటు
తయారుచేయువారు
ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్
విజయవాడ

# చందమామ

నంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ" లాగే దీపావళి పండగ పిన్నలకూ, పెద్దలకూ కూడా ఆహ్లాదం కలిగిస్తుంది. అందుచేత ప్రతి దీపావళికీ "చందమామ" ప్రత్యేక సంచికలు వెలువరిస్తున్నాము.

ఇది ఈయేటి దీపావళి సంచిక. దీనిని పూర్వపు దీపావళి సంచికల కంటె ఎక్కువ ఆకర్షవంతంగా చెయ్యటానికి కృషిచేశాము.

"కుక్కల కథలు" గతమాసం ప్రారంభమైన శీర్షిక. ఈ శీర్షిక కింద ఈ సంచికలో పోలీసు కుక్కలను గురించి మీరు చదువుతారు.

ఈ పోలీసు కుక్కలలో విశేషం ఏమిటంటే ఇవి ఒక్క యజమానికి మాత్రమే కాక సమాజానికంతకూ సేవ చేస్తున్నాయి. నేరస్తులను పట్టుకుంటున్నాయి.

దీపావళీ పండగకు "చందమామ" మీకందరికీ శుభాకాంక్షలు చెబుతున్నది.



సంపుటి 25 : నవంబర్ 1959 : సంచిక 5



CHITRA




దుర్యోధనుడు ఆగ్రహావేశుడై తన తమ్ము లతోకూడా కలిసి పాండవసేనల నిర్మూల నానికి పూనుకున్నాడు. శ్వేతుడు భీష్ముణ్ణి విడిచి దుర్యోధనాదులపై సుడిగాలిలాగా వచ్చిపడ్డాడు. వారు ఆ తాకిడికి చెల్లాచెదరై పోయారు. వెంటనే శ్వేతుడు భీష్ముణ్ణి వెతు కుతూ వెళ్లి ఎదిరించాడు. మళ్లీ ఇద్దరూ పోరాడారు. అతడు భీష్ముడి వింటినీ, జెండానూ విరగగొట్టాడు. అతడు భీష్ముణ్ణి చంపేశాడే అనుకున్నారు కౌరవులు. పాండ వులు ఆనందంతో శంఖాలు పూరించారు.

దుర్యోధనుడు భీష్ముడికి అండగా తన యోధులను తీసుకుపోయి, "మీరు భయ పడకండి. భీష్ముడి చేతిలో ఇప్పుడే శ్వేతుడు చావబోతున్నాడు!" అని అరిచాడు. త్వర లోనే బాహ్లికుడూ, కృతవర్మా, కృపుడూ, శల్యుడూ, వికర్ణుడూ మొదలైన అనేకమంది యోధులు భీష్ముడికి సహాయంగా వెళ్లి ఒంటరిగా ఉన్న శ్వేతుణ్ణి ప్రతిఘటించారు. శ్వేతుడు ఇంతమందితోనూ పోట్లాడుతూనే భీష్ముడి విల్లు విరగగొట్టి, ఆయనను బాణా లతో కొట్టాడు. భీష్ముడివంటివాడుకూడా ఆ బాణాలను మధ్యదారిలో విరగగొట్టలేక పోయాడు. ఇది చూసి కౌరవయోధులకు ధైర్యం జారింది.

అయితే భీష్ముడి పౌరుషం మాత్రం రెచ్చింది. ఆయన తన బాణాలతో శ్వేతుడి రథాన్నీ, గుర్రాలనూ, సారథినీ నాశనం చేశాడు. శ్వేతుడు నేలపైకి దిగి ఒక ప్రళయమైన శక్తిని భీష్ముడిపై విసిరాడు. నిప్పులు కక్కుతూ తనపైకి వచ్చే ఆ శక్తిని భీష్ముడు దారిలోనే ఖండించాడు. శ్వేతు డొక పెద్ద గద తీసుకుని భీష్ముడి రథంపై విసిరాడు. దాని తాకిడికి రథం చూర్ణ మయింది, కాని భీష్ముడు అపాయం గ్రహించి రథంనుంచి ముందుగానే దిగేశాడు.



భీష్ముడు మరొక రథం ఎక్కి శ్వేతుడి పైకి వచ్చాడు. ఈలోపుగా పాండవయోధులు శ్వేతుడికి అండగా పరిగెత్తుకుంటూ వచ్చారు. కాని భీష్ముడు వారిని తన బాణాలతో సమీపానికి రాకుండా ఆపాడు. తరవాత ఆయన శ్వేతుడిపైన బ్రహ్మాస్త్ర సహితమైన ఒక తీవ్ర బాణాన్ని ప్రయోగించాడు. అది శ్వేతుడి కవచాన్ని ఛేదించి, శరీరంనుంచి దూసుకుపోయి, భూమిలోకి దూరిపోయింది.

శ్వేతుడు చనిపోగానే విరాటుడి మరొక కొడుకు శంఖుడనేవాడు శల్యుణ్ణి చంపటానికి నిశ్చయించుకుని వచ్చాడు. శంఖుడి చేతిలో శల్యుడు చావకుండా కౌరవయోధులు కాపాడారు. వారికి సహాయంగా భీష్ముడు వచ్చాడు. శంఖుణ్ణి అర్జునుడు కాపాడాడు. అయితే భీష్ముడు ఆ మొదటి రోజు యుద్ధంలో చూపిన ప్రతాపాగ్నికి పాండవ సేనలు నల్లులు మాడినట్టు మాడిపోయాయి. సూర్యాస్తమయం అయేదాకా భీష్ముడు ఈ దారుణ హత్యాకాండ సాగిస్తూనే వచ్చాడు.

మొదటి రోజు యుద్ధం ముగిసింది.

ఆ రాత్రి ధర్మరాజు తన తమ్ములనూ, ఇతర యోధులనూ వెంటబెట్టుకుని కృష్ణుడి శిబిరానికి వెళ్లాడు. మొదటి రోజు యుద్ధం చూసి కుంగిపోయిన ధర్మరాజు కృష్ణుడితో,




"బావా, భీష్ముడు మన సేనలనూ, నా పక్షాన పోరవచ్చిన యోధులందరినీ బలి తీసుకునేటట్టు కనబడుతున్నది. రాజ్యలోభంచేత నేను ఈ యుద్ధానికి పూనుకున్నాను. నాకోసం ఈ మహారథులందరూ భీష్ముడి చేతిలో చావటం నాకిష్టం లేదు. నాకోసం నా తమ్ములందరూ తీవ్రంగా గాయపడ్డారు. ఈ పాపం నాకు వద్దు. నేను అరణ్యాలకు పోయి తపస్సుచేసుకుంటాను. మాలో అస్త్రాలు తెలిసినవాడు అర్జునుడు ఒక్కడే అయిఉండికూడా విజృంభించి యుద్ధం చెయ్యక, వెనకాడాడు. భీముడు ఒక్కడే వీరోచితంగా పోట్లాడాడు మిగిలిన



వాళ్ళమంతా భయభ్రాంతులమై చూస్తూ ఉండగా, భీష్ముడు మన సేనలను కార్చిచ్చులాగా నాశనం చేయనారంభించాడు. నేను యుద్ధం సాగించాలంటే ఆ భీష్ముణ్ణి చంపగల శూరుడు మన పక్షాన ఎవరున్నారో నీవు కనిపెట్టు. నీ అనుగ్రహం లేకపోతే మేమీ యుద్ధంలో జయించలేం," అన్నాడు.

కృష్ణుడు ధర్మరాజుతో, "నీవు శోకించనవసరంలేదు. నీకు సేనాపతిగా ధృష్టద్యుమ్నుడున్నాడు. ఈ రాజులందరూ నీకు విజయం చేకూర్చుతారు. నీ తమ్ములు సర్వలోక శూరులు. శిఖండి చేతిలో భీష్ముడు చచ్చితీరుతాడు. నీకింకా విచారమెందుకు?" అన్నాడు. ఈ మాటలు అందరికీ ఉత్సాహం కలిగించాయి.

ధర్మరాజు ధృష్టద్యుమ్నుడివైపు తిరిగి, "సేనాపతీ, దేవతలకు కుమారస్వామి ఎలాటివాడో, నీవు మాకు అలాటివాడివి. నీవు ముందుండి మమ్మల్నందరినీ నడిపించి ఈ యుద్ధంలో మాకు విజయం చేకూర్చి పెట్టాలి!" అన్నాడు.

"మహారాజా, మీరు సందేహించవద్దు. నేను రణగర్వితులైన భీష్మద్రోణాదు లందరికీ పరాభవం చేస్తాను. ద్రోణుడు నా చేతిలో తప్పక చస్తాడు. ఇకనుంచి యుద్ధం ఎలా ఉంటుందో చూడండి," అని ధృష్టద్యుమ్నుడు చెప్పిన జవాబుకూడా అందరికీ ఉత్సాహం కలిగించింది.

"రేపటి యుద్ధంలో క్రౌంచారుణ వ్యూహం పన్ని మన సేనలు శత్రువులకు అజేయంగా ఉండేలాగు చెయ్యి," అని ధర్మరాజు ధృష్టద్యుమ్నుణ్ణి కోరాడు. ధృష్టద్యుమ్నుడు సరేనన్నాడు.

రెండవ రోజు తెల్లవారింది. సూర్యోదయానికి పూర్వమే పాండవసైన్యాలు యుద్ధసన్నద్ధమయాయి. ఈ రోజు సేనలకు ముందుగా అర్జునుడున్నాడు. ఈ సేన క్రౌంచపక్షి ఆకారంలో అమర్చబడింది. దాని తలా,



కన్నులూ, మెడా, రెక్కలూ, శరీరమూ, తోకా ముదలైన స్థానాలలో అయా వీరులు ఉంచబడ్డారు. రెక్కల స్థానాన్ని భీముడూ, ధృష్టద్యుమ్నుడూ ఆక్రమించారు. ఈ వ్యూహానికి ముందుగా రథంలో అర్జునుడు, సూర్యకాంతి పడి మేరుపర్వతం ప్రకాశిస్తున్నట్టు ప్రకాశిస్తున్నాడు.

అక్కడ దుర్యోధనుడుకూడా తన సేనను ఒక వ్యూహాకారంలో అమర్చ నాజ్ఞాపించాడు. దానియొక్క వివిధ పార్శ్వాలను రక్షించటానికీ, సేనాపతి అయిన భీష్మణ్ణి రక్షించటానికీ మహాయోధులు నియోగించబడ్డారు. ఈ సేనలు సూర్యోదయం కాగానే యుద్ధానికి కదిలాయి. ఉభయపక్షాలవారూ శంఖాలు పూరించి, సింహనాదాలు చేశారు.

రెండవ రోజు యుద్ధం ప్రారంభమయింది. ఉభయపక్షాలవారూ చంపటానికీ, చావటానికీ ఉత్సాహపడుతూ యుద్ధం సాగించారు. భీష్ముడు విల్లెక్కుపెట్టి పాండవ సైన్యాలను సమీపించాడు. ఆయనను భీముడూ, అర్జునుడూ, అభిమన్యుడూ, కేకయులూ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైనవారు ఎదిరించారు. ఆయన అందరినీ అంబుల వర్షంలో ముంచేసి పాండవవ్యూహాన్ని చెదరగొట్టాడు. ఇది చూసి అర్జునుడు మండిపడి కృష్ణుడితో తన రథాన్ని భీష్ముడిపైకి నడపమన్నాడు. భీష్మణ్ణి వెంటనే చంపకపోతే తన పక్షంవారంతా ఆయన చేతిలో చచ్చి తీరుతారని అతనికి తోచింది. భీష్మణ్ణి సమీపించబోతూ అర్జునుడు దారిలో గల కౌరవసేనలను నిర్మూలం చేయసాగాడు. అప్పుడు భీష్ముడితోబాటు ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, దుర్యోధనుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ మొదలైనవారు అర్జునుణ్ణి ఎదుర్కొని అతనిపై శరపరంపర ప్రయోగించారు. వారి దెబ్బలను లక్ష్యపెట్టక



25



అర్జునుడు వారందరినీ తిరిగి బాణాలతో కొట్టాడు. ఈలోగా సాత్యకీ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ అర్జునుడికి అండగా వచ్చి, కౌరవపక్షాన్ని ఎదుర్కొన్నారు.

రెండు పక్షాల మధ్యా సంకులసమరం సాగింది. అర్జునుడు విజృంభించి తన గాండీవంతో కౌరవయోధులను బలిపుచ్చుకోనారంభించాడు. అప్పుడు దుర్యోధనుడు భీష్ముడితో, "తాతా, అర్జునుడు మన సేనలను నాశనంచేస్తున్నాడు. నీమూలానగదా కర్ణుడు అస్త్రం పట్టలేదు. అర్జునుణ్ణి చంపే మారం నీవే చూడాలి!" అన్నాడు.



"ఛీ, ఏమి క్షత్రియధర్మం!" అంటూ భీష్ముడు అర్జునుడిపైకి వెళ్ళాడు. ఇద్దరూ ఒకరికొకరు తీసిపోకుండా సమయుద్ధం సాగించారు. ఒకరి ధ్వజాలు ఒకరు పడగొట్టారు. ఒకరి గుర్రాలను ఒకరు కొట్టారు. భీష్ముడు కోపావేశంలో కృష్ణుణ్ణి మూడు బాణాలతో కొట్టాడు. కృష్ణుడు రక్తపుమరకలతో పుష్పించిన మోదుగుచెట్టులాగా తయారయాడు. భీష్ముడు చేసిన ఈ పనికి ప్రతిక్రియగా అర్జునుడు భీష్ముడి సారథిని మూడు బాణాలతో కొట్టాడు. వారిద్దరూ ఒకరినొకరు చంపుకోవాలనే ఉద్దేశంతోనే యుద్ధంచేశారు. కాని వారిలో ఏ ఒకరూ రెండోవారిని జయించలేకపోయారు.

వీ రిలా యుద్ధం చేస్తూండగా ధృష్టద్యుమ్నుడికీ, ద్రోణుడికీ మధ్య ద్వంద్వయుద్ధం ప్రారంభమయింది. మొదట్లో కొంతసేపు ఇద్దరూ సమంగానే పోరాడారు, ఒకరినొకరు బాణాలతో తీవ్రంగా కొట్టుకున్నారు. కాని రానురాను ద్రోణుడిది పైచెయ్యి అయింది. అయన ధృష్టద్యుమ్నుడి బాణాన్నీ, రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేశాడు; ధృష్టద్యుమ్నుడు తనపై విసిరిన శక్తినీ, గదనూ బాణాలతో ఖండించాడు. చివరకు ధృష్టద్యుమ్నుడు డాలూ, కత్తి



పట్టుకుని తనపైకి వస్తూంటే, ద్రోణుడు బాణవర్షంతో అతన్ని ముందుకు రానివ్వకుండా చేశాడు.

ఈ స్థితిలో భీముడు ధృష్టద్యుమ్నుడికి అండగా వచ్చి, అతన్ని వేరొక రథంలో ఎక్కించాడు. ఇది చూసి దుర్యోధనుడు ద్రోణుడికి రక్షణగా కాలింగుణ్ణి సేనతో సహా భీముడిపైకి పంపాడు.

కలింగరాజు అపారమైన తన సేనతో వచ్చి భీముణ్ణి చుట్టుముట్టాడు. అయినా, ఆయన కొడుకు శక్రదేవుడనేవాడూ భీముడి పైన బాణాలు వేశారు. త్వరలోనే భీముడి రథపు గుర్రాలు కూలిపోయాయి. భీముడు కదలని ఆ రథంనుంచే ఒక ఇనప గద విసిరేసరికి శక్రదేవుడు చచ్చాడు, ఆ దెబ్బకే అతని ధ్వజంకూడా విరిగిపోయింది. ఈ లోపుగా కాలింగుడి రథాలు భీముడిచుట్టూ కమ్ముకున్నాయి. భీముడు ఒక డాలూ, కత్తి తీసుకుని కాలింగుడిపైకి వచ్చాడు. కాలింగుడు భీముడిపైన తీవ్రమైన బాణాలూ, తోమరాలూ విసిరాడు. భీముడు వాటిని తన కత్తితో ఛేదించుతూ, కలింగ రాజు కొడుకైన భానుమంతుడిపైకి లంఘించాడు. భానుమంతుడు ఏనుగుపై ఎక్కి ఉన్నాడు. అతను భీముణ్ణి చూసి గట్టిగా



గర్జించాడు. ఈ గర్జనకు మండిపడి, అంతకంటె భయంకరంగా గర్జించుతూ భీముడు ఏనుగు దంతాలు పట్టుకుని ఒక్క గెంతుతో దానిపై కెక్కి, తన కత్తిదెబ్బలతో భానుమంతుణ్ణీ, ఏనుగునూ కూడా చంపేశాడు.

తరవాత భీముడు మృత్యుదేవతలాగా కలింగసేనను పొట్టబెట్టుకోసాగాడు. నేల మీద నడుస్తూ, కత్తి తప్ప మరొక ఆయుధం లేకుండా అతను ఏనుగులను పడగొట్టాడు, సైనికులను వేల సంఖ్యలో మట్టుపెట్టాడు. గుర్రాలూ, ఏనుగులూ అతని తాకిడికి చచ్చి పడిపోయాయి. దగ్గిరికి వచ్చిన రథికులను కూడా భీముడు చంపేశాడు. తనపై వచ్చే



బాణాలను తప్పించుకోవటానికి కత్తి గిరగిరా తిప్పాడు. కలింగసేనలో చాలాభాగం భీముడి చేతిలో నాశనమయింది.

ఇంతలో భీముడికి కలింగరాజైన శ్రుతాయుషుడు ఎదురుతగిలాడు. భీముణ్ణి అతను బాణాలతో కొట్టి బాధించాడు. కాని ఇంతలోనే భీముడి సారథి అయిన అశోకుడు మరొక రథంతో వచ్చి చేరాడు. భీముడా రథంలో ఎక్కి శ్రుతాయుషుడితో యుద్ధం చేశాడు. త్వరలోనే శ్రుతాయుషుడు భీముడి చేతిలో చచ్చాడు.

భీముడు ఒంటరిగా చేసిన ఈ యుద్ధాన్ని ధృష్టద్యుమ్నుడు కళ్లారా చూసి పొంగిపోయాడు. అతను శిఖండి మొదలైన యోధులతో, "వెళ్లండి! భీష్ముడు మొదలైన వాళ్లను ఎదుర్కోండి!" అని ప్రోత్సహించి, సాత్యకితో సహా భీముడున్న చోటికి వచ్చాడు.

ఇంతలో కౌరవసైన్యాలలో కలకలం సాగింది. భీముడు మృత్యువిహారం చేస్తున్నాడని విని భీష్ముడు భీముడికేసి వచ్చాడు. భీష్ముడికి భీమ సాత్యకి ధృష్టద్యుమ్నులతో యుద్ధం జరిగింది. భీష్ముడు భీముడి గుర్రాలను చంపాడు. భీముడు తనపైకి శక్తి విసరగా దాన్ని బాణాలతో ఖండించాడు. ధృష్టద్యుమ్నుడు భీముణ్ణి తన రథంలో కూచోబెట్టుకుని ఎడంగా తీసుకుపోయాడు. కాని ఆ సమయంలోనే సాత్యకి బాణాలతో భీష్ముడి సారథిని చంపాడు. గుర్రాలు బెదిరి భీష్ముడి రథంతోసహా పారిపోయాయి.

ఇది చూసి భీముడు ఆనందంతో ధృష్టద్యుమ్నుణ్ణి కౌగలించుకుని అతనితో సహా సాత్యకి వద్దకు వచ్చాడు. సాత్యకి రథందిగి వచ్చి భీముణ్ణి కౌగలించుకుని, "భీమా! ఏమి నీశౌర్యం! ఒంటరిగా కలింగరాజునూ, అతని ఇద్దరు కొడుకులనూ, కలింగసేనలోని అనేకమంది యోధులనూ చంపేశావుగదా!" అని అభినందించాడు.

ఇంతలో మధ్యాహ్నమయింది.





# తెలివి గలది

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆ రైతుకు ఒక్కడే కొడుకు. అందుచేత రైతు తన కొడుకును చాలా గారాబంగా పెంచి, వాడు పెద్దవాడై ఎంతో సమర్థుడవు తాడని ఆశించాడు. రైతు కొడుకుకూడా ఆరోజుకారోజు తాను చాలా తెలివిగలవాణ్ణి అవుతున్నానని గర్వపడుతూ వచ్చాడు. వాడికి తన తెలివితేటలలో నమ్మకం హెచ్చిన కొద్దీ, తండ్రికి తగ్గసాగింది. ఇలా కొంత కాలం జరిగాక ఒకనాడు రైతు కొడుకుతో, "నీకు ఇరవై యేళ్లు నిండాయికదా, కాస్తయినా చేతికి అక్కరకు రాకుండా ఉన్నావే! ఆలోచించినకొద్దీ నీకు తెలివితేటలు శూన్యంగా ఉన్నట్టు కనబడుతున్నది!" అన్నాడు.

"తెలివితేటలు నాకు లేకపోతే ఇంకెవరికున్నాయి? నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు!" అన్నాడు కొడుకు.

"మన ఇంట్లో గొర్రెచర్మం ఉన్నది. దాన్ని రేపు సంతలో అమ్మి రా, నీ తెలివి తేటలు చూస్తాం!" అన్నాడు రైతు.

"క్షణంలో చర్మం అమ్మేసి డబ్బు తీసుకురానూ?" అన్నాడు కొడుకు.

"ఓరి పిచ్చివాడా! చర్మం అమ్మి డబ్బులు తీసుకురావటంలో తెలివి ఏమున్నది? ఆ పని ఎవడైనా చేస్తాడు. నిజంగా తెలివిగలవాడివైతే చర్మమూ, దాని ఖరీదూకూడా తీసుకురావాలి. తెలిసిందా?" అన్నాడు తండ్రి.

కొడుకు కొంచెంకూడా ముందూ వెనకా ఆలోచించకుండా, "ఓ అలాగే చేస్తాను. రేపు సాయంకాలం లోపల గొర్రెచర్మమూ, దాని ఖరీదూకూడా తెస్తాను, చూసుకో!" అని ప్రగల్భాలు పలికాడు.

మర్నాడు ఉదయం పెందలాడే వాడు గొర్రెచర్మం చుట్టి చంకన పెట్టుకుని సంతకు

టి. నారాయణరావు

బయలుదేరాడు. వాడు సంతలో అడుగు పెట్టుతూండగానే ఎవరో ఎదురై, "గొ(రె తోలు అమ్మకానికా? ఎంతకిస్తావు?" అని అడిగాడు.

"ఎంత కిచ్చినా నాకు తోలూ, దాని ధరా కూడా కావాలి!" అన్నాడు రైతు కొడుకు.

తోలు కొందామనుకున్నవాడు గట్టిగా నవ్వి, "భలే ఆలోచనే! ఇది ఇంతవరకు ఎవరికీ తట్టలేదు. అయినా నలుగురినీ అడిగిచూడు, ఎవరైనా చర్మం తీసుకోకుండా దాని ఖరీదు నీకిచ్చేస్తారేమో!" అంటూ తనదారిన తాను వెళ్లాడు.

సంతలో ఎంతోమంది రైతుకొడుకును చర్మం ఖరీదు అడిగారు. అందరికీ వాడు అదే సమాధానం చెప్పాడు. అందరూ వాణ్ణి చూసి నవ్వి చర్మం కొనకుండా తమదారిన వెళ్లిపోయారు.

మిట్టమధ్యాన్నం దాటిపోయింది. పొద్దు వాలిపోతున్నది. రైతుకొడుకు తెచ్చిన చర్మం ఇంకా వాడి చంకలోనే ఉన్నది. సంత అంతటా తిరిగి తిరిగి వాడి కాళ్లు పడిపోతున్నాయి. వాడు ఒక గుంపు గుమికూడి ఉన్న చోటికి వచ్చాడు.

ఈ గుంపు నడిమధ్య ఒక వి(పవినోది ఇం(దజాలం చేస్తున్నాడు. వాడు రైతు



కొడుకును చూడగానే, "అబ్బాయీ, ఆ తోలు ఒకసారి ఇయ్యి, మంచి వినోదం చూపిస్తాను!" అన్నాడు.

రైతుకొడుకు తన చంకలో ఉన్న చర్మాన్ని విప్రవినోదికి ఇచ్చేశాడు. వాడు ఆ తోలు చుట్టను భూమిమీద నిలబెట్టి దానిపైన తన పైబట్ట కప్పి, అందరినీ చప్పట్లు కొట్ట మన్నాడు. అందరూ చప్పట్లు కొట్టినాక వాడు తన పైబట్టను తీసేశాడు. దానికింద ఒక మామిడిమొక్క ఉన్నది. దానికి ఒక మామిడికాయకూడా ఉన్నది.

రైతుకొడుకు మొదట ఆశ్చర్యపడ్డాడు. మళ్లీ తన చర్మాన్ని తనకిచ్చెయ్యమని విప్రవినోదిని అడుగుదామనుకుంటే వాడు కాస్తా అదృశ్యమయాడు.

రైతుకొడుకు కళ్లనీళ్లపర్యంతమయాడు. వాడు చర్మాన్నీ, దాని ఖరీదునూకూడా తెచ్చి ఇస్తానని తండ్రికి మాట ఇచ్చి ఉన్నాడు. చర్మం ఖరీదు రాకపోగా, చర్మం కూడా పోయింది. వట్టి చేతులతో ఇంటికి పోతే తనకు బుద్ధిలేదని రుజువవుతుంది.

ఈ మనోవేదనకు తోడు వాడికి ఆకలి కూడా వేస్తున్నది. ఎదురుగా ఉన్న మామిడి మొక్కకు కాయ కనిపిస్తున్నది. దాన్ని తిని అయినా ఆకలిబాధ కొంత నివారించు కుందామనుకుని వాడు ఆ కాయను పట్టు



కున్నాడు. వెంటనే మామిడిమొక్క మాయమై గొర్రెచర్మం కనిపించింది.

అంతే చాలుననుకుని, సంతోషంతో వాడు ఆ గొర్రెచర్మం చుట్టి చంకన పెట్టుకుని ఇంటిదారి పట్టాడు. సూర్యాస్తమయం కాబోతున్నది. దారి నిర్మానుష్యంగా ఉన్నది. కొంతదూరం వెళ్లేసరికి వెనక నుంచి ఎవరో పిలిచినట్టు వినపడింది. తిరిగిచూస్తే విప్రవినోది కనిపించాడు.

విప్రవినోది రైతు కొడుకును కలుసుకుని వాడి వెంట నడుస్తూ, "నువు చాలా బుద్ధి మంతుడివి. నీకొక్క సలహా చెబుతాను, దాన్ని మరిచిపోకు!" అన్నాడు.

"ఏమిటా సలహా?" అని రైతు కొడుకు అడిగాడు.

"దారిలో ఆడవాళ్లు కనబడితే వాళ్లను ఆప్యాయంగా కుశల ప్రశ్నలు చెయ్యి," అన్నాడు విప్రవినోది.

కొంతదూరం నడిచాక దారి చీలింది. విప్రవినోది రెండో దారిన వెళ్లిపోయాడు. రైతుకొడుకు తన గ్రామంవేపు నడుస్తూ చీకటిపడేసరికి ఒక వాగువద్దకు వచ్చాడు. ఆ వాగుకు అంతదూరంలో ఒక ఇల్లున్నది. ఆ ఇంట్లోనుంచి ఒక పదహారేళ్ల పిల్ల బిందెతో వచ్చి వాగులో నీళ్లు తీసుకుంటున్నది. విప్ర వినోది యిచ్చిన సలహా జ్ఞాపకంపెట్టుకుని



రైతుకొడుకు, "అమ్మాయీ, అంతా కులాసా?" అని అడిగాడు.

"మీరంతా కులాసాయేనా?" అని ఆ అమ్మాయికూడా అడిగింది.

ఇద్దరూ మాట్లాడుకోవటంలో ఆ పిల్ల రైతుకొడుకు పొద్దుటినుంచీ భోజనం చెయ్యలేదని తెలుసుకున్నది. అమె అతన్ని తన ఇంటికి తీసుకుపోయి జొన్నరొట్టెలు పెట్టింది. తరవాత అతన్ని గొర్రెతోలు గురించి అడిగింది.

"మా అయ్య దీన్ని అమ్మి దీని ఖరీదూ, చర్మమూ కూడా తీసుకురమ్మన్నాడు. నాకు సాధ్యంకాలేదు!" అన్నాడు రైతుకొడుకు.

"ఇంతేగద! నేను నీకు చర్మమూ, చర్మంయొక్క ఖరీదూకూడా ఇస్తానుండు!" అంటూ ఆ పిల్ల వాడివద్ద గొర్రెతోలు తీసుకుని దానిమీద ఉన్న బొచ్చంతా కత్తిరించి, తోలూ, బొచ్చుఖరీదూకూడా రైతుకొడుక్కు ఇచ్చేసింది.

రైతుకొడుకు పరమానందం చెంది ఆ అమ్మాయితో వస్తానని చెప్పి ఇంటికి వచ్చేశాడు. తన కొడుకు తెచ్చిన చర్మమూ, డబ్బులూ చూసి రైతు సంతోషించి, "నీకీ ఉపాయం చెప్పిన మనిషి ఎవడురా?" అని అడిగాడు.

"మగమనిషి కాదు, ఆడమనిషి!" అంటూ వాడు జరిగినదంతా చెప్పాడు.

"ఇదేనా నీ తెలివి? అటువంటి అమ్మాయి తటస్థపడితే వెంట తెచ్చుకుని పెళ్లిచేసుకోరూ? నీకు తెలివితేటలు లేవని నేను మొదటినుంచీ అనుకుంటూనే ఉన్నాను!" అన్నాడు రైతు.

రైతుకొడుకు అప్పటికప్పుడే బయలుదేరి వాగు ఉన్నచోటికి వెళ్లి, ఆ అమ్మాయితో, "నన్ను పెళ్లాడతావా?" అని అడిగాడు. ఆ అమ్మాయి నవ్వి, వాణ్ణి పెళ్లాడటానికి ఒప్పుకుని రైతు ఇంటికి వచ్చేసింది. రైతు వాళ్లిద్దరికీ గొప్పగా పెళ్లిచేసేశాడు.



# దొంగతనం దాగదు















# "టెలిఫోన్‌లో చూడు!"






"టపాకాయ కాలుస్తున్నాం, వినిపిస్తున్నదా, నాన్నా? రంగు రంగుల మతాబాలు కాలుస్తున్నాం, కనబడుతున్నవా, నాన్నా?"




## 17

[చంద్రవర్మకు శివపురం అనే పట్టణంలో సుబాహుడు కనిపించాడు. అతడిద్వారా చంద్ర వర్మకు సేనాని ధీరమల్లుణ్ణి గురించి తెలిసింది. ఆ సమయంలో ఒక దూత వచ్చి, సేనాని ధీరమల్లుణ్ణి, సర్పకేతుడు పెద్ద సైన్యంతో వెంటబడి తరుముతున్నట్టు వార్త చెప్పాడు. సుబాహుడు ధీరమల్లుడికి సహాయంగా వెళ్ళటం మంచిదన్నాడు. తరవాత—]

చంద్రవర్మకుకూడా ఆ పరిస్థితుల్లో సుబాహుడు చెప్పిందే ఉత్తమ మార్గంగా తోచింది. క్షణాలమీద నగరంలోని సైనికులంతా ఒక చోటికి చేర్చబడ్డారు.

కొద్దిసేపటిలో సైన్యమంతా నగర ప్రాకారాలు దాటి ఉత్తర దిక్కుకేసి కదిలింది. చంద్రవర్మా, సుబాహుడూ సైన్యానికి ముందుభాగాన వున్న అశ్వసైనికుల వెంట వున్నారు. రాత్రంతా సైన్యం ఆగకుండా ముందుకు కదులుతూనె వున్నది. ఇంకా సూర్యోదయం కావటానికి ఒకటీ రెండు ఘడియలుండనగా ఒక కొండమలుపు నుంచి పరిగెత్తుకు వస్తున్న గుర్రాల గిట్టల చప్పుడు వినిపించింది. ఆ వచ్చేది మిత్రులో, శత్రువులో తెలుసుకునేందుకు సుబాహుడూ, చంద్రవర్మా పదిమంది రౌతులతో సైన్యాన్నుంచి వేరుపడి, అతి వేగంగా ముందుకు వెళ్లారు. సరిగా కొండమలుపులో నలుగురు అశ్వికులు వారికి ఎదురయారు. మసక చీకటిలో సుబాహుణ్ణి చూస్తూనే వాళ్లు తమ




గుర్రాలను ఆపి, "సేనానీ, రాజప్రతినిధి వీరమల్లు మమ్మల్ని పంపాడు. సర్పకేతు డనే రాజు సైన్యాలు నగరంకేసి పారిపోయి వస్తున్న మన సైనికులను అడ్డనారివెంట వచ్చి అటకాయించినై పోరాటం జరిగింది. మనవాళ్లు చాలామంది మరణించారు. రాజప్రతినిధి తన అశ్వికులతో, శత్రువులు వేగంగా నగరంకేసి రాకుండా అడ్డుతూ తిరోగమిస్తున్నారు," అని చెప్పారు.

సైనికులు యిలా చెపుతూన్నంతలో మరి కొందరు గుర్రపు రౌతులు వారికేసి రావటం కనిపించింది. చూస్తూన్నంతలో ధీరమల్లుడు మహావేగంతో వారిని సమీపించి, "సుబాహూ! ఇక మనం నగరరక్షణకు వెళ్లవలసిందే. సర్పకేతుడితో " అంటూ మాట మధ్యలో ఆగి, చంద్రవర్మకేసి చూసి ముఖంలో ఆశ్చర్యం కనబరిచి, అంతలోనే ఎక్కడలేని సంతోషంతో గుర్రంమీదినుంచి ఒక్క గెంతున కిందికి దూకి, "మహారాజా!" అంటూ చంద్రవర్మదగ్గిరకు పరిగెత్తుకువచ్చి అతడి చేయి పట్టుకున్నాడు.

"మళ్లీ నిన్ను కలుసుకోగలనన్న నమ్మకం నాకేనాడూ కలగలేదు ధీరమల్లా! కాని మనం ఇలాంటి విచిత్ర పరిస్థితుల్లో కలుసుకున్నాం. తీరిగ్గా మాట్లాడుకునేందుకు సమయంకాదు. నగరరక్షణకు బయలుదేరుదామా?" అన్నాడు చంద్రవర్మ.

సేనాని ధీరమల్లుడు ఒక్క క్షణకాలం ముందు వున్న సైన్యంకేసీ, వెనకనుంచి పారిపోయి వస్తున్న అశ్వికులకేసీ చూసి, "మహారాజా! మీ రాకతో పరిస్థితి మారిపోయింది. సర్పకేతుడితో ఆఖరు పోరాటం జరపవలసిన సమయం ఆసన్నమయింది. అది నగరంలోగాని, నగరం వెలపలగాని, ఎక్కడైనా ఒకటే. ఇప్పుడు ఈ మార్గాన ముందుకు తోసుకువస్తున్నది ముఖ్యంగా అతడి అశ్వసైన్యం. కాల్బలమంతా ఆ కొండ వెనక మైదానంలో వున్నది. మనం



వ్యూహం పన్నటానికి కొంచెం వ్యవధి కావాలి," అంటూ సుబాహుడికేసి తిరిగి, "సుబాహూ! సైన్యాన్నంతా పక్కకు మళ్లించి ఆ కనబడే కొండ కనుమలోకి తీసుకుపో. కనుమద్వారాన్ని కాపాడుకోవటానికి కొద్ది సైన్యం చాలు. అక్కడ కొద్ది మంది అశ్వికుల్నీ, గురిగాళ్లయిన కొంత మంది విలుకాళ్లనూ కాపలా వుంచు," అంటూ చంద్రవర్మతో కలిసి కనుమద్వారంకేసి బయలుదేరాడు.

కొద్దిసేపటికల్లా సైన్యమంతా కనుమలో ప్రవేశించింది. చంద్రవర్మ ధీరమల్లుడితో, తను వీరపురం వదిలిపోయిన తరవాత, తనకు తటస్థపడిన కష్టసుఖాలను గురించి సంగ్రహంగా చెప్పాడు. అంతా శ్రద్ధగా విన్న ధీరమల్లుడు ఎంతో వినయంగా చంద్రవర్మతో, "మహారాజా! నేనూ, సుబాహుడూ పడ్డ కష్టాలూ, చివరకు ఈ శివసింహరాజు కొలువులో చేరి, ఆయన ప్రతినిధిగా శివపురానికి రావటం — అంతా సుబాహుడు మీకు చెప్పేవుంటాడు. ఈనాడు తలవని తలంపుగా మనకు సర్పకేతుడితో పోరు తటస్థించింది. ఆ దుష్టుడితో ఏదో ఒకనాడు మనం యుద్ధం చేయక తప్పదుగదా? ఆ పని యిప్పుడే చేద్దాం. ఇందులో విజయమో,



వీరస్వర్గమో — అంతకన్న మనకు మరో మార్గం లేదు!" అన్నాడు.

"అవును, ధీరమల్లూ! మనం స్వదేశం వదిలి, ఈవిధంగా దేశాలు పట్టుకు తిరగటంలో అర్థంలేదు. సైన్యాన్ని సమాయత్తపరుచు. ఆ సర్పకేతుడితో చావో బతుకో తేల్చుకుందాం," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అంటూండగానే కనుమద్వారం దగ్గిర కలకలం బయలుదేరింది. అక్కడ కాపలావున్న విలుకాళ్ళు బాణాలు ఎక్కుపెట్టి, ముఖద్వారంకేసి రివ్వురివ్వుమని వదులుతున్నారు. కొందరు అశ్వికులు గుర్రాలను ముందుకు దూకించి

తమ చేతగల ఈటెలతో కనుమలోకి చొచ్చుకురా ప్రయత్నిస్తున్న శత్రు అశ్వికులను పొడుస్తున్నారు.

"మహరాజా! సర్పకేతుడు కనుమలోకి ప్రవేశించేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఆ ఇరుకు మార్గంలో వాడిని రెండువైపులనుంచి ఎదుర్కొని నాశనం చేయుటమే మన వ్యూహం," అంటూ సేనాని ధీరమల్లుడు చెంగున గుర్రంమీదికి ఎగిరాడు. చంద్రవర్మ కూడా ఒక్కగెంతున తన అశ్వాన్ని అధిరోహించాడు.

చంద్రవర్మా, ధీరమల్లుడూ కలిసి క్షణాల మీద తమ సైన్యాన్ని రెండుగా భాగించి, కనుమకు రెండువైపులా నిలబెట్టారు. సుబాహుడు కొద్దిమంది కాల్బల సైనికులతో, అశ్వికులతో కనుమ ద్వార రక్షణకు పూనుకున్నాడు.

క్రమంగా సర్పకేతుడి సైన్యం యిరుకైన కనుమ ద్వారాన్నుంచి లోపల ప్రవేశించేందుకు గట్టి ప్రయత్నం ప్రారంభించింది. వందల వేల సంఖ్యలో వున్న అతడి అశ్వికులూ, కాలిబంట్లూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, కనుమలోకి తోసుకువచ్చేందుకు ప్రయత్నించ సాగారు. వారిలో చాలామంది ద్వారందగ్గిరే సుబాహుడి అశ్వికుల ఈటె పోటులకూ, విలుకాళ్ళ అంబుల దెబ్బకూ



హతం కాసాగారు. వాళ్ళను తప్పుకొని ముందుకువచ్చిన సైనికులను, చంద్రవర్మా, ధీరమల్లుడూ తుద ముట్టించుతున్నారు.

పోరాటం యీ విధంగా కొంతసేపు సాగే సరికి, శత్రుసైనికులతోపాటు కొంతమంది చంద్రవర్మ సైనికులుకూడా మరణించటం జరిగింది. శత్రువులు అసంఖ్యాకులు. తమ సైన్యం బహుకొద్ది. సర్పకేతుడు మరికొంత సైన్యాన్ని కనుమద్వారంమీద దాడికి ఉపయోగిస్తే, తాము చిక్కులో పడిపోగలమని చంద్రవర్మా, ధీరమల్లుడూ వూహించారు.

వాళ్ళిద్దరూ మార్గాంతరం ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో సర్పకేతుడి కంచు కంఠం కనుమద్వారందగ్గిర మార్మోగింది.

"ఆ చంద్రవర్మా, ధీరమల్లుడీ తలలు తెచ్చినవాడికి లక్ష వరహాలు యిస్తాను. ఈ పరగణాకంతటికీ సామంతరాజును చేస్తాను. ముందుకు దూకండి. హేయ్!" అంటూ సర్పకేతుడు తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.

కన్నుమూసి తెరిచేంతలో కనుమ ముఖద్వారం భయంకర యుద్ధరంగంగా మారిపోయింది. సర్పకేతుడు యిస్తానన్న బహుమానాన్ని ఆశించిన శత్రుసైనికులు అన్నిటికీ తెగించి సన్నని కనుమద్వారం గుండా లోపలికి వచ్చేందుకు పోటీలు పడి






సాధ్యం కాకపోతే, ఆ రాళ్ళగుట్టల చాటునే వుండి మన విలుకాళ్ళు, శత్రువులమీద బాణాలు ప్రయోగించవచ్చు. అప్పుడు సర్పకేతుడు తప్పనిసరిగా కొంతసైన్యాన్ని కనుమ ముఖద్వారాన్నుంచి వెనక్కు మళ్ళించి తీసుతాడు," అన్నాడు.

"అవును, మహారాజా! మనం ఈ పరిస్థితుల్లో ఏదోఒకటి చేసి తీరాలి. శత్రుసైన్యమంతా ఒక్కసారిగా కనుమలో ప్రవేశిస్తే, యిక మనకు పారిపోయేందుక్కూడా మార్గం లేకుండా పోతుంది," అన్నాడు సేనాని ధీరమల్లుడు.

చంద్రవర్మ కొందరు విలుకాళ్ళను వెంటబెట్టుకుని పెద్దపెద్ద బండరాళ్ళమీదుగా పాకుతూ పైకెక్కి, కనుమముందు వున్న మైదానంకేసి చూశాడు. అతడి కంటబడిన దృశ్యం ఎంత ధైర్యశాలినైనా భీరువుగా చేసేలా వుంది. పందల వేల సంఖ్యలో వున్న సర్పకేతుడి అశ్వసైన్యం, కాల్బలం కనుమ ముఖద్వారంకేసి కదులుతున్నది. ఇంత గొప్ప సైన్యాన్ని యుద్ధంచేసి ఎలా ఓడించగలను? అనుకున్నాడు చంద్రవర్మ. మహా అయితే తనూ, ధీరమల్లుడూ, సుబాహుడూ, ముసలివాడి కొడుకు దేవలుడూ శత్రువుల చేత పడకుండా పారిపోవచ్చు. ఆ తరవాత,

యుద్ధం చేయసాగారు. సుబాహుడివద్ద వున్న కొద్ది సైన్యానికి తోడుగా ధీరమల్లుడు మరి కొంత సైన్యాన్ని పంపాడు. కాని సర్పకేతుడి సైనికులు చచ్చిన, చావనున్న తమ తోటి వాళ్ళ మీదుగా గుర్రాలను దూకిస్తూ క్రమంగా ముందుకు తోసుకువస్తున్నారు.

హఠాత్తుగా చంద్రవర్మ తన గుర్రాన్ని ధీరమల్లుడి గుర్రంకేసి దూకించి, "ధీరమల్లూ! నాకొక వుపాయం తోస్తున్నది. మనం కొంత సైన్యంతో, ఆ కనబడే రాళ్ళ గుట్టలమీదుగా ఎక్కి అవతలికి పోయి వెనక నుంచి సర్పకేతుడి సైన్యాన్ని ఎదిరించటం బావుంటుంది. ఒకవేళ అవతలికి దిగటం





తిరిగీ తనకు అరణ్యాలు పట్టుకు తిరిగే జీవితం ప్రారంభమవుతుంది.

చంద్రవర్మ మనసులో యిలా అనుకుంటూ నిస్పృహగా శత్రుసైన్యం కేసి చూస్తున్నంతలో అతడికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు ఎంతో గుండె నిబ్బరంతో, శత్రుసైన్యం దృష్టికి కనబడేలా ఒక ఎత్తయిన రాతిమీద నిలబడి, ఖంగుమనే కంఠస్వరంతో వాళ్ళనుద్దేశించి యిలా అన్నాడు:

"ఓ సైనికులారా! నేను వీరపుర సామంతుడైన సూర్యవర్మ కుమారుణ్ణి, చంద్రవర్మను! దుష్టుడైన సర్పకేతుడు, మాహిష్మతీ రాజవంశాన్ని ఎంత క్రూరంగా నిర్మూలించి, తను చక్రవర్తి అయాడో మీకందరికీ తెలుసు. నేను తిరిగీ మాహిష్మతీ రాజ్య సింహాసనంమీద యశోవర్ధన చక్రవర్తి సంతానంలో మిగిలివున్న తపోవర్ధనుణ్ణి కూర్చోబెట్టదలిచాను. ఒకవేళ ఆయన అందుకు సమ్మతించని పక్షంలో మీకిష్టుడైన మరెవరినైనా సరే చక్రవర్తిని చేయవచ్చు. దుష్టుడూ, కపటీ, క్రూరకర్ముడూ అయిన సర్పకేతుణ్ణి ముందు బంధించాలి. నా వీరపుర సంస్థాన సైనికులెవరైనా మీలో వుంటే వారికి ఈ పని ఒప్పచెపుతున్నాను."

చంద్రవర్మ కంఠస్వరం వింటూనే సైనికులంతా స్థాణువుల్లా అయిపోయారు. అతడు మాట్లాడటం ముగించేసరికి, సైన్యంలో ఒక భాగంనుంచి, "వీరపుర మహారాజుకూ, జై!" అన్న కేకలు వినిపించినై. ఆ వెంటనే సైన్యంలో అక్కడక్కడా కలకలం, తోసుకోవటాలూ, కుమ్ముకోవటాలూ ప్రారంభమయింది. చూస్తూండగానే సైన్యంనుంచి ఒక పెద్ద సమూహం వేరుపడి, చంద్రవర్మ నిలబడివున్న చోటుకు రాసాగింది. ఆ వెంటనే "సర్పకేత మహారాజుకూ, జై!" అన్న కేకలు వినిపించినై. చంద్రవర్మకేసి వస్తున్న అశ్వసైనికులూ, కాల్బల సైనికులూ



43

చప్పున వెనుదిరిగి, భీకరంగా అరుస్తూ, వాళ్ల మీదికి దూకారు.

చంద్రవర్మ వెనుదిరిగి కనుమలో వున్న సేనాని ధీరమల్లుడితో, "ధీరమల్లూ! ఇదే మంచి అవకాశం. సర్పకేతుడి సైన్యంలో ఒక పెద్దభాగం మనపక్షానికి తిరిగింది. వాళ్ళు మిగిలిన వాళ్ళతో పోరాడుతున్నారు. నువ్వు మన భటులనందరినీ హెచ్చరించి, ఒక్కుమ్మడిగా కనుమ ముఖద్వారంమీద దాడిచేసి బయటి మైదానంలోకి రాగలిగా వంటే, సర్పకేతుణ్ణి క్షణాలమీద సర్వనాశనం చేయవచ్చు," అని కేకపెట్టాడు.

సేనాని ధీరమల్లుడు తన అనుచరులను హెచ్చరించేలోపలే, సర్పకేతుడు తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు. తన సైనికుల్లో చాలామంది శత్రుపక్షం వహించి తనమీద కత్తిదూయటం చూస్తూనే, అతడు తన అనుచరులను కనుమ ముఖద్వారం నుంచి వెనక్కు రప్పించి, విశ్వాసపాత్రులైన మిగతా సైనికులతో యుద్ధరంగం వదిలి పోరిపోసాగాడు.

చంద్రవర్మా, ధీరమల్లుడూ తమ సైన్యాన్ని కూడదీసుకుని, పారిపోతున్న సర్పకేతుడి సైన్యంవెంట పడ్డారు. ఇరుకైన కొండమార్గాలవెంట, నితారుగావున్న పెద్దపెద్ద రాళ్ళనూ, లోతైన అగాధాలనూ తప్పుకుంటూ చంద్రవర్మ మిట్టమధ్యాన్నం వేళ వరకూ సర్పకేతుడి సైన్యాన్ని తరిమాడు. శత్రు సైనికుల్లో కొద్దిమంది అశ్వికులూ, కాలిబంట్లూ అతడిచేతికి దొరికారు. కాని, ముఖ్య సైన్యంతో సర్పకేతుడు చంద్రవర్మకు అందకుండా కొండల్లో చాలాదూరం పారిపోగలిగాడు.

సేనాని ధీరమల్లుడూ, చంద్రవర్మా సంప్రతించుకుని నలుగురు అశ్వికుల్నీ, పదిమంది భటులనూ, సర్పకేతుడి జాడ తెలుసుకునేందుకు ముందుకుపంపారు.

—(వచ్చే సంచికలో ముగింపు)



# ధర్మసందేహం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని చెట్టు నుంచి దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంతసేపుగా మన ఇద్దరికీ మైత్రి నడుస్తున్నదిగదా, నీకు నేను ఎక్కువా? ఆ స్మశానంలోని బైరాగి భిక్షువు ఎక్కువా? ఈ ధర్మసందేహన్ని గురించి నువు ఆలోచించాలి. ఇలాటి ధర్మసందేహాలు ఎవరికో, ఎప్పుడో అరుదుగా ఏర్పడుతూంటాయి. వింధ్యదేశపు సేనాని కూతురైన రత్నావళికి కలిగిన ధర్మసందేహన్ని గురించి చెబుతాను, విని నీ శ్రమను మరిచిపో!" అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు వింధ్యరాజువద్ద శ్రీమంతుడనే సేనాపతి ఉండేవాడు. ఆ దేశంలోని ఒక ప్రాంతంలో దొంగతనాలూ, దోపిడీలూ అవి

## బేతాళ కథలు



అది ఆయన కుమార్తె అయిన రత్నావళి వివాహ సమస్య.

రత్నావళి చాలా అందమైనది, బుద్ధి మంతురాలుకూడానూ. అందుచేత ఆమెను పెళ్ళాడతామని అనేకమంది యువకులు రాజవంశాలకు చెందినవారు సయితం వచ్చారు. ఈ యువకులలో రాజసింహుడనే వాడుకూడా ఉన్నాడు.

అయితే రాజసింహుడు రత్నావళిని పెళ్ళాడగోరి వచ్చినవాడు కాడు. అతను సేనాపతిని మరొక సహాయం అర్థించటానికి వచ్చాడు. అతని కోట దొంగలుండే ప్రాంతం లోనే ఉన్నది. దొంగలు అప్పటివరకూ అతనిపైకి రాకపోయినప్పటికీ, వారిని ఎలా గైనా పట్టుకుని శిక్షించాలన్న కోరిక అతనిలో ప్రబలంగా ఉన్నది. ఎందుచేతనంటే ఆ ప్రాంతానికి అతనే గొప్పవాడు.

చ్ఛిన్నంగా సాగుతూ ఉండేవి. శ్రీమంతుడు ఆ ప్రాంతంపైన తన సేనలతో ఎన్నోసార్లు దాడిచేశాడు. కాని ఒక్కసారికూడా దొంగలు దొరకలేదు. దొంగలూ, వాళ్ళు కాజేసిన సొత్తూకూడా గారడీలాగా మాయమైపోతూ ఉండేది. దొంగలబాధ అనుభవించేవాళ్ళుకూడా ఎన్నడూ ఒక్క దొంగనుకూడా పట్టలేక పోయారు. పోయిన సొత్తు తిరిగి ఎవరికళ్ళా పడలేదు.

ఇది శ్రీమంతుడికి పెద్ద సమస్య అయి పోయింది. దానితో అహోరాత్రాలు మధన పడుతూండగా ఆయనకు మరొక సమస్య వచ్చిపడింది.

"సేనాపతిగారు నాకు తగినంత సేనను ఇచ్చినట్టయితే వాళ్ళ ఖర్చంతా నేనె భరించి పోషిస్తాను. మా కొండప్రాంతంలో నివసించే వాళ్ళను సేనగా తయారుచేయగలను గాని, వాళ్ళు చాలా మొరటు మనుషులు. అదీ గాక ఆ ప్రాంతంలో ఎవడినీ నమ్మటానికి లేదు. మీరిచ్చే సేన నా కోటకు రక్షగా ఉండ టమే గాక, దొంగల జాడ తెలిసినప్పుడు

వాళ్ళను వేటాడటానికికూడా పనికివస్తుంది. నేను ఎన్నోసార్లు దొంగలను వేటాడి దాదాపు పట్టుకున్నానుకూడా. అయితే నావెంట వచ్చినవాళ్ళు సమయానికి పారిపోయి నన్ను దొంగలకు వప్పగించినంతపని చేశారు. కనుక నేను కోరిన ప్రకారం చేశారంటే మీ సమస్యకూడా తీరిపోతుంది!" అన్నాడు రాజసింహుడు సేనాపతితో.

సేనాపతి ఏదీ నిర్ణయించకమునుపే రాజసింహుడు రత్నావళిని చూడటం తటస్థించింది. అతను రత్నావళిని వివాహమాడ గోరి, తన ఈ కోరికనుకూడా సేనాపతికి నివేదించాడు.

సేనాపతికి రాజసింహుడిపై గురి కుదిరింది. అతను అందమైన యువకుడు. వారిది గొప్ప వంశం. అతను దొంగలు చెలరేగే ప్రాంతంలో ఉంటున్నాడు. ఆ ప్రాంతంలో తనకు సన్నిహితుడైన బలవంతుడొకడుండటం అన్నివిధాలా మంచిది. అతను తన అల్లుడే అయే పక్షాన కొంత సేనను అతనిపరం చెయ్యటానికి సంకోచించనవసరం ఉండదు.

ఇవన్నీ ఆలోచించి రాజసింహుడికి తన కుమార్తె రత్నావళిని ఇద్దామనే శ్రీమంతుడు నిశ్చయించాడు.



ఆయనను ఒక్క విషయమే బాధించింది. అదేమిటంటే, తన కుమార్తె వెళ్ళక వెళ్ళక అలాటి ప్రాంతానికి కాపరం వెళ్లటం! అయితే ఆయన, ఈ దొంగల బెడద త్వరలోనే తీరిపోతుందనీ, అంతదాకా ఏదో ఒక మిషపైన తన కుమార్తెను తనవద్దనే ఉంచుకుందామనీ ఆశించాడు.

రత్నావళీ రాజసింహుల వివాహం వైభవంగా జరిగింది. మామగారిచ్చిన సేనతో రాజసింహుడు బయలుదేరేటప్పుడు అతని వెంట రత్నావళికూడా బయలుదేరింది.

"అమ్మా, పెళ్ళి అయిందో లేదో అప్పుడే మమ్మల్ని విడిచి వెళ్ళిపోవాలా? కొద్ది

రోజులు ఇక్కడే ఉండరాదూ? ఎప్పుడు వెళ్ళాలని ఉంటే అప్పుడే నీ భర్త వచ్చి నిన్ను తీసుకుపోతాడుగదా. ఎంతో కాలంగా ఆ ప్రాంతంలో పరిస్థితి చాలా అరాజకంగా ఉన్నది!" అన్నాడు శ్రీమంతుడు కూతురితో.

"ఒకరిని పెళ్ళాడినాక పుట్టింటినే అంటి పెట్టుకోవటం స్త్రీధర్మం కాదు, నాన్నా. మిమ్మల్ని ఏనాడు చూడాలనిపించితే ఆనాడే రాగలను. కొండంత భర్త ఉండగా నాకు దొంగల భయం ఉంటుందా?" అని రత్నావళి తండ్రికి నచ్చచెప్పి భర్తవెంట వెళ్ళిపోయింది.

కాపరానికి వెళ్ళినది మొదలు రత్నావళికి మనశ్శాంతి లేదు. ఎవరి నోట విన్నా దొంగలు చేసే ఘోరాలే. వాళ్ళుచేసే దోపిడీలకూ, హత్యలకూ అంతు లేదు. ఆమె ఉండే కోట చాలా పెద్దది. అందులో పగలంతా వందలాది నౌకర్లుండేవారు. కాని రాత్రి అయేసరికి బిక్కుబిక్కుమంటూం డేది. దీనికి తగ్గట్టుగా తరుచు రాత్రివేళ రాజసింహుడు దొంగలను వేటాడబోయే వాడు. రత్నావళి చీమ చిటుక్కుమన్నా హడలిపోతూ కన్ను మూయలేకపోయేది.

దొంగలకు ఒక నాయకుడున్నాడట. వాణ్ణిగురించీ, వాడి శక్తులను గురించీ నమ్మ



శక్యంగాని కథలు ఎన్నో రత్నావళి విన్నది. తన భర్త పట్టుకోవటానికి ప్రయత్నించు తున్నది వాణ్ణే! ఏ అర్ధరాత్రివేళ తన భర్త వాడికి చిక్కిపోతాడోనని రత్నావళి హడలి పోతూ, తన భర్తని కాపాడమని వెయ్యి దేముళ్ళకు మొక్కుకునేది.

రాజసింహుడు సైన్యాన్ని తెచ్చి తన కోటలో ఉంచినాకూడా దొంగల విజృంభణ ఏమీ తగ్గలేదు. దొంగలు కోటపైకి వస్తే ఏమ యేదో గాని వారు ఆ చాయలకు రాలేదు. క్రమంగా రత్నావళి భయం తగ్గిపోయింది. ఆమె భర్తనుగురించి కూడా భయపడటం మానేసింది.

ఒక ఏడాది గడిచింది. రత్నావళి ఒక పిల్లవాణ్ణి కన్నది. ఆ పిల్లవాడికి ఒక దాదిని ఏర్పాటుచేశారు. ఈ దాది రత్నావళి వెంట వచ్చినదే. ఒకరోజున ఈ దాది కంగారుగా రత్నావళి గదికి వచ్చి, "అమ్మా, మనం ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండ రాదు, వెళ్ళిపోదాం పదండి! దొంగలంటే ఎవరో కాదు, మన కోటలో రోజూ పనిచేసే వాళ్ళే! వాళ్ళ నాయకుడుకూడా మన అయ్యగారే! నేను వాళ్ళను కళ్ళారా చూశాను!" అన్నది.

ఈ వార్త విని రత్నావళి నిర్ఘాంతపోయింది. కాని కొంచెం ఆలోచిస్తే అది నిజం






కావచ్చునని ఆమెకు తోచింది. అందుకే దొంగలు ఏనాడూ ఈ కోటపై పడలేదు. అందుకే తన భర్త దొంగల నాయకుణ్ణి ఇన్నాళ్ళుగా వేటాడుతున్నప్పటికీ ఆయనకు ఏ అపాయమూ రాలేదు. తన భర్త పెద్ద నాటకం ఆడుతున్నాడు. తన తండ్రి కళ్లలో దుమ్ము చల్లటానికి సేనను తెచ్చుకున్నాడు. సేన కోటలో ఉన్నది, బయట దొంగతనాలు జరుగుతున్నాయి! దొంగలను రోజూ వేటాడుతున్నట్టు నటిస్తున్నవాడే దోపిడీలూ, హత్యలూ చేస్తున్నాడు!

అయితే రాజసింహుడు తనపైన ఎంతో ప్రేమగా ఉంటాడు. అటువంటివాడు దొంగా, హంతకుడూ అని ఆమె నమ్మలేకపోయింది. నిజం కళ్ళారా చూస్తేగాని నమ్మరాదని నిశ్చయించుకున్నది.

ఒకనాటి రాత్రి రాజసింహుడు బయటికి పోబోతుంటే రత్నావళి బలవంతంచేసి అతన్ని ఉంచేసింది. ఒకరాత్రివేళ అతను చప్పుడు కాకుండా తన పక్కమీదినుంచి లేచి, తన భార్య నిద్రపోతున్నట్టు రూఢి చేసుకుని బయటికి వెళ్ళాడు.

అయితే రత్నావళి నిద్రపోతున్నట్టు నటిస్తున్నదే గాని నిజంగా నిద్రపోవటంలేదు. భర్త బయటికి వెళ్ళగానే ఆమె లేచి ఒక నల్లని మేలిముసుగు వేసుకుని తానుకూడా బయటికి వెళ్లింది. తెల్లని దుస్తులు ధరించిన తన భర్త భవనానికి కొంతదూరంలో ఉన్న చింతచెట్ల మధ్యకు వెళ్ళి చీకట్లో అదృశ్యం కావటం గమనించింది.

ఆ తోపుమధ్య ఒక వట్టిపోయిన దిగుడు బావి ఉన్నది. రత్నావళి ఆ బావిని చేరి తొంగి చూసింది. బావి అంతా చీకటిగా ఉన్నది. అయినా తన భర్త ఆ బావిలోకి దిగి ఉండాలి. అందుకని రత్నావళి తాను గూడా బావిలోకి దిగింది. బావి అట్టడుగున గోడలవెంబడి ఏవో పొదలు పెరుగుతున్నాయి. ఒక పొద వెనకనుంచి ఆమెకు

అస్పష్టంగా మాటలు వినిపించాయి. ఆమె ఆ పాదవద్దకు వెళ్ళి చూడగా దాని వెనక సన్నని ద్వారం కనిపించింది. దాని వెనక ఒక పెద్ద మాళిగ ఉన్నది. అందులో జనం ఉన్నారు. వారిమధ్య రాజసింహుడున్నాడు. అతని చుట్టూ ఉన్నవాళ్ళందరూ తమ నౌకర్లే. అయితే వాళ్ళిప్పుడు తమ యజమానితో వినయంగా మాట్లాడక చాలా పరుషంగా మాట్లాడుతున్నారు.

"నేను మీ నాయకుణ్ణి, ఆ సంగతి బాగా గుర్తుంచుకోండి! నాతో ఎదురుతిరిగి మాట్లాడినవాణ్ణి చంపేస్తాను!" అని రాజసింహుడు గర్జిస్తున్నాడు.

"మాకు నీ నాయకత్వంలో నమ్మకం పోతున్నది. నీ వాలకం చూస్తే మమ్మల్ని సైనికులకు పట్టి ఇచ్చేటట్టున్నావు. మేము మరొక నాయకుణ్ణి ఎన్నుకుంటాం!" అన్నాడు ఒకడు. వాడు దివాణపు చాకలి!

రాజసింహుడు చివాలున చాకలిపైన కత్తి దూశాడు. అంతలోనే అయిదారు ఈటెల మొనలు అతని రొమ్ముమీద వాలాయి. ఇది చూస్తూనే రత్నావళి కంపించిపోయి, నిలుచున్న చోటనే స్పృహ తప్పి మూర్ఛపోయింది.

తిరిగి స్పృహ వచ్చేసరికి ఆమె తన గదిలో ఉన్నది. రాజసింహుడు సమీపం



లోనే ఉన్నాడు. తన భర్త సజీవుడై ఉన్నందుకు ఆమె తృప్తితో నిట్టూర్చింది. అతను తన భార్యతో, "నీ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. నిన్ను రేపే పుట్టింటికి పంపేస్తాను. నీవూ పిల్లవాడూ కొంతకాలం అక్కడే ఉండి తిరిగిరండి!" అన్నాడు.

ఆ మర్నాడే రత్నావళి సైనికులను వెంటబెట్టుకుని తన కుమారుడితోసహా పుట్టింటికి వెళ్లిపోయింది. దారిలో ఆమెను ఒక ధర్మసందేహం పీడించింది: ఆమె తన తండ్రితో భర్తను గురించి యదార్థం చెప్పాలా, చెప్పకూడదా?

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రత్నావళికి పట్టుకున్న ధర్మసందేహమే నాకూ పట్టుకున్నది. ఆమె తన తండ్రికి విధేయురాలైఉండి, ప్రజాశత్రువైన తన భర్త రహస్యం బయటపెట్టాలా? లేక భర్తకు విధేయురాలైఉండి తన భర్త రహస్యం తండ్రికి చెప్పకుండా దాచి, ఆయన ఏ ఉద్దేశంతో తనను రాజసింహుడికిచ్చి పెళ్ళిచేశాడో ఆ ఉద్దేశాన్ని భంగపరచాలా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "స్త్రీ పెళ్ళికాక ముందు తండ్రికీ, పెళ్ళి అయినాక భర్తకూ విధేయురాలై ఉండాలని పెద్దలు చెబుతారు. అది అలాఉంచి, దొంగల నాయకుణ్ణి పట్టుకునే బాధ్యత సేనాపతిది, ఆయన కుమార్తెది కాదు. అదీకాక రాజసింహుడు తన భార్యకు తన రహస్యం తెలిసిపోయినట్టు తెలిసిఉండికూడా ఆమెను తండ్రివద్దకు పంపి, ఆమెయందు తనకు గల విశ్వాసాన్ని ప్రకటించాడు. అందుచేత రత్నావళి తన భర్త రహస్యాన్ని తండ్రికి చెప్పవలసిన అవసరం ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)



# తీరని సందేహం

ఒకనాడు సింహానికి తన ప్రతాపం చూపాలన్న కోరిక పుట్టింది. అది అడవి అంతా తిరుగుతూ ఒక పులిని కలుసుకుని, "నువు మహా పొగరుగా ఉన్నావట! ఈ అరణ్యానికి రాజెవరో తెలుసా ?" అని అడిగింది.

"తమరే, మహాప్రభూ!" అన్నది పులి.

మరికొంతసేపటికి సింహానికి ఒక గొరిల్లాకోతి కనిపించింది.

"ఏయ్, ఈ అరణ్యానికి ప్రభువు ఎవరో తెలుసా ?" అని సింహం దాన్ని అడిగింది.

"తమరే, మహాప్రభూ!" అన్నది గొరిల్లాకోతి.

ఇంకా కొంతసేపటికి సింహానికి ఒక ఏనుగు ఎదురయింది. సింహం దానికి ఎదురుగా వెళ్ళి, "ఏయ్, నల్లమొద్దూ! ఈ అరణ్యానికి రాజెవరో తెలుసా ?" అని అడిగింది.

ఏనుగు సింహన్ని తొండంతో ఎత్తి దూరాన ఉన్న పొదలలోకి విసిరి కొట్టింది. సింహం లేచి ఒళ్ళు దులుపుకుంటూ, "అంత కోపందేనికి ? రాజెవరో తెలియకపోతే తెలియదని చెప్పరాదూ ?" అన్నది.





# మోసపోయిన మోసగాడు

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆయనకు ఒక కొడుకు ఉండేవాడు. కొడుకు ఆటే తెలివిగలవాడు కాడు గాని, రైతు కోడలు చాలా తెలివిగలది.

ఒకనాటి ఉదయం రైతుకొడుకు ఇంటి ముందు కూచుని కొడవలికి పిడి చెక్కుకుంటూ ఉండగా ముగ్గురు మనుషులు వచ్చి, "నిన్ను మా రాజుగారు ఒక్కసారి రమ్మన్నారు. మా రాజు సముద్రరాజు," అన్నారు.

సముద్రరాజు దేవతల జాతికి చెందినవాడు. ఈ మనుషులు చూడబోతే నల్లగా, వికారంగా కనిపించారు. నిజానికి వాళ్లు రాక్షసరాజు దూతలు, ఆ సంగతి రైతు కొడుకు గ్రహించలేదు.

"మీ రాజుకు నాతో ఏం పని?" అని అడిగాడు వాడు.

"ఈ దేశంలో నీ అంత తెలివిగలవాడు లేడుట. మా దేశంలో ఎవరూ చెయ్యలేని పని ఒకటి నీచేత చేయించుకుందామని మా రాజుగారు నిన్ను రమ్మన్నారు," అన్నారు వాళ్లు.

"తెలివితేటలకు నేను కాదు, మా నాన్న. కావలిస్తే ఆయనను మీ దేశం తీసుకువెళ్లండి. ఆయన ఇప్పుడు పొలానికి వెళ్లాడు, బాగా చీకటి పడిగాని ఇంటికి రాడు!" అన్నాడు రైతుకొడుకు.

"అయితే నువ్వూ, ఆయనా కూడా వచ్చెయ్యండి. మేము మళ్లీ మీకోసం రాము. మా పడవ రేవులో ఉన్నది. రేపు ఉదయం బయలుదేరి రేవుకు వస్తే మిమ్మల్ని మా దేశం తీసుకుపోతాం!" అని ఆ నల్లటి మనుషులు ముగ్గురూ వెళ్లిపోయారు.

ఆ రాత్రి తండ్రి ఇంటికి రాగానే కొడుకు, "నాన్నా, మనకోసం సముద్రరాజు మనుషులనూ పడవనూ పంపాడు. మనవల్ల ఆయన కేదో పని కావాలిట. ఆయన పని

పి. రాజేశ్వరి

తీర్చామంటే మనకు మంచి బహుమానం దొరుకుతుంది," అన్నాడు.

"వాళ్లు రాజుగారివద్దనుంచి ఆనవాలు తెచ్చారా ?" అని అడిగాడు రైతు.

"తీసుకు రాలేదు. వాళ్లు మళ్లీ రారుట. మనం రేపు ఉదయం రేవుదాకా వెళ్లితే పడవలో ఎక్కించుకుని తమ దేశం తీసుకు పోతామన్నారు," అని రైతు కొడుకు చెప్పాడు.

"రేవుదాకా నడవటమే ? నావల్ల కాదు. చాలా దూరం ఉన్నది. దూరం తగ్గించ గలిగితే చెప్పు, వస్తాను!" అంటూ రైతు వెళ్లి పడుకున్నాడు.

రైతుకొడుకు తన భార్యతో సముద్రరాజు ఆహ్వానంగురించి చెప్పి, "రేవు దారి తగ్గిస్తేనే గాని నాన్న రానంటాడు! అది సాధ్యమయే పనేనా ?" అన్నాడు.

అతని భార్య, "దారి తగ్గించటానికి ఒకటే ఉపాయం ఉన్నది. నడిచినంత సేపూ కథ చెప్పటం. ఆ పని చేసి మీ నాన్నను వెంట తీసుకుపొండి!" అని భర్తతో అన్నది.

రైతుకొడుకు తన భార్య తెలివితేటలకు చాలా సంతోషించాడు. అతను తెల్లవారు ఝామునే లేచి తండ్రిని లేపి, "నాన్నా,



రేవుకు బయలుదేరుదాం పద. దారి తగ్గిస్తే వస్తానన్నావుగా! తగ్గిస్తాను, రా!" అన్నాడు.

రైతూ, కొడుకూ సముద్రతీరానికి బయలుదేరారు. దారి పొడుగునా కొడుకు తండ్రికి ఏవో కథలు చెప్పాడు. చివరకు వారు రేవు చేరుకున్నారు. రేవులో ఒక నాసిరకం పడవా, ముగ్గురు నల్లటి మనుషులూ ఉన్నారు.

"ఇదేం పడవరా ? ఇది రాక్షసుల పడవ లాగున్నది!" అన్నాడు రైతు.

నల్లటివాళ్లు ఆయనతో, "మా రాజుగారి పడవలన్నిటిలోకీ దీని వేగం చాలా ఎక్కువ. అందుకని దీన్ని పంపారు!" అన్నారు.




రైతూ, కొడుకూ అందులో ఎక్కి కూచున్నారు. నల్లటివాళ్లు తెడ్లు వేసి పడవను నడపసాగారు. అది మామూలు పడవలలాగే నడిచి కొంతసేపటికి ఒక లంకను సమీపించింది. ఆ లంకలో ఎక్కడా ఒక్క చెట్టుగాని, పొదగాని లేక బోడిగా ఉన్నది. అది రాక్షసుల లంక.

ఆ సంగతి రైతూ, కొడుకూ తెలుసుకున్నారు గాని చేసేదిలేదు.

నల్లటివాళ్లు తండ్రి కొడుకులను తీరాన దించి తమ రాజు దగ్గిరికి తీసుకుపోయారు. రాక్షసరాజు ఇంకా నల్లగా, మరింత వికారంగా ఉన్నాడు.

"మమ్మల్ని ఇంతదూరం ఎందుకు రప్పించారు?" అని రైతు రాక్షసరాజును అడిగాడు.

"మరేమీ లేదు. మావద్ద ఒక పెద్ద భాండం ఉన్నది. దానికింద నిప్పుచెయ్యాలంటే మావాళ్లకు సాధ్యంకాలేదు. మీరిద్దరూ దానికింద మంట చేశారా సరేసరి, లేకపోతే, మిమ్మల్ని ఇక్కడినుంచి ప్రాణాలతో పోనివ్వను," అన్నాడు రాక్షసరాజు.

"ముందు మాకా భాండం ఎక్కడున్నదో చూపించండి. మిగిలిన పని మేము చూస్తాం!" అన్నాడు రైతు.

రాక్షసులు వారిని ఒక పెద్ద గదిలోకి తీసుకుపోయారు. ఆ గదిమధ్య రెండు నిలువుల ఎత్తు రాగిభాండం ఉన్నది. రైతు రాక్షసులను గదిబయటికి పంపేసి తలుపు గడియపెట్టాడు. తరవాత తండ్రి కొడుకులిద్దరూ ఆ భాండంచుట్టూ తిరిగి వచ్చారు.

రైతు తన కొడుకుతో, "నాయనా, ఈ భాండం సంగతి నీకు తెలుసా? ఇది అక్షయభాండం. మన దేశపు రాజుగారి ముత్తాతగారు రోజూ ఇందులో అన్నం వండించి అడిగినవారికల్లా లేదనకుండా పెట్టేవారు. దాన్ని ఈ రాక్షసులు ఎత్తుకొచ్చి ఇక్కడ పెట్టుకున్నారు," అన్నాడు.

"ఇప్పుడు మనం ఈ రాక్షసుల బారి నుంచి బయటపడేది ఎలా ?" అన్నాడు కొడుకు అదుర్దాగా.

"దానికి ఉపాయం నేను చూస్తానులే !" అంటూ రైతు గదితలుపు తెరిచి రాక్షసులను కేకపెట్టాడు. వాళ్లు వచ్చి, "భాండం కింద మంట చేశారా ?" అని అడిగారు.

"మంట చేస్తాం! గాలి ఊదితే మంట అవుతుందా ? నేరేడుకట్టెలూ, మామిడి కట్టెలూ, చింతకట్టెలూ, పొన్నకట్టెలూ, రావికట్టెలూ, మర్రికట్టెలూ, మారేడు కట్టెలూ, వెలగకట్టెలూ, వెదురుకట్టెలూ— తొమ్మిది రకాల కట్టెలు తీసుకురండి; దూదీ, చెకుముకి రాయీ, ఇనపముక్కా తీసుకురండి. క్షణంలో మంట చేస్తాం!" అన్నాడు రైతు.

రాక్షసులు తమ రాజువద్దకు వెళ్లి రైతు అన్నమాటలు చెప్పారు. రాక్షసరాజు వచ్చి, "మీకు మతి పోయిందా ఏమిటి ? మా లంకలో గరికకూడా మొలవదు, చెట్టు అన్నది అసలే లేదు, కట్టెలు ఎలా వస్తాయి ?" అన్నాడు.

"మీ దేశంలో లేకపోతే మా దేశంనిండా కట్టెలే. మా కోడలి నడిగి మీవాళ్లను పట్టుకు రమ్మనండి. మీ మనుషులవెంట




మీ కొడుకు లిద్దర్ని పంపితేగాని అది నమ్మదు !" అన్నాడు రైతు.

"వాళ్లు కట్టెలు తెచ్చినదాకా ఈ గది లోనే ఉండండి !" అంటూ రాజు తండ్రి కొడుకులను భాండం ఉన్న గదిలో బంధించి, తన కొడుకులనూ, పడవ నడిపే వాళ్లనూ రైతుఉండే దేశానికి పంపాడు.

రాక్షసరాజు కొడుకులు రైతు ఇల్లు చేరుకుని రైతు కోడలితో, "మేము రాక్షసరాజు కొడుకులం. నీ మామా, భర్తా మా దేశంలో ఉన్నారు. నిన్నడిగి నేరెడు కట్టెలూ, మామిడి కట్టెలూ, చింత కట్టెలూ, పొన్న కట్టెలూ, రావి కట్టెలూ, మర్రి కట్టెలూ,



67

మారేడు కట్టెలూ, వెలగ కట్టెలూ, వెదురు కట్టెలూ, దూదీ, చెకుముకి రాయీ, ఇనప ముక్కా తెమ్మన్నారు! మేం పోవాలి, వెంటనే ఇయ్యి!" అన్నారు.

పెద్ద మోసం జరిగిందని రైతు కోడలు తెలుసుకున్నది. ఆమె రాకసరాజు కొడుకులతో, "మీకు కావలిసినవన్నీ ఆ చీకటి గదిలో ఉన్నాయి. మీకు కావలిసినంత పట్టుకెళ్లండి!" అన్నది. వాళ్లు సరేనని చీకటిగదిలో ప్రవేశించారు. వెంటనే రైతు కోడలు చీకటికొట్టు తలుపు మూసి, దానికి కప్పుతాళం వేసింది.

ఆమె బయటికి వచ్చి మిగిలిన రాకసులతో, "మీ రాజుకొడుకు లిద్దరూ మా చీకటిగదిలో ఉన్నారు. ఎంత వెతికినా తాళంచెవి ఎక్కడున్నదో కనిపించటం లేదు. మా మనుషులిద్దరూ ఇంటికి వచ్చి వెతికితే తప్ప అదికనిపించదని మీ రాజు గారితో చెప్పండి," అన్నది.

రాకసులు పడవలో తమ లంకకు బయలుదేరి వెళ్లి రైతు కోడలు అన్నమాటలు తమ రాజుతో చెప్పారు.

రాకసరాజు పళ్లు పటపట కొరికాడు, కాని ఏమీ చెయ్యలేకపోయాడు. కాకిపిల్ల కాకికి ముద్దు. తన కొడుకులను త్వరగా తెప్పించుకునే ఉద్దేశంతో ఆయన రైతునూ, రైతు కొడుకునూ చెర విడిపించి వెంటనే ప్రయాణం చేయించాడు.

"మేము మీ పని పూర్తిచేసి, బహుమతి పొందిగాని వెళ్లం. మాకేమీ తొందరలేదు!" అన్నాడు రైతు.

రాకసరాజు వారికి ఇంత బంగారంముద్ద బహుమానంగా ఇచ్చాడు. తరవాత పడవలో రైతునూ, అతడి కొడుకునూ ఇంటికి పంపేసి అదే పడవలో తన కొడుకులను తిరిగి తెప్పించుకున్నాడు.

ఆ నాటినుంచి రైతూ, అతని కొడుకూ, కోడలూ సుఖంగా జీవించారు.



# విలియం షేక్స్పియర్

విలియం షేక్స్పియర్ ఇంగ్లండులోని "స్ట్రాట్‌ఫర్డ్ ఆన్ ఎవాన్" అనే పట్టణంలో 1564 లో జన్మించాడు.

వీరి కుటుంబం మధ్యతరగతికి చెందినది. ఇతని తండ్రి పేరు జాన్, తల్లిపేరు మేరీ. విలియం వారి మూడవ కుమారుడు.

అతను తన 18వ ఏట తనకన్న 8 ఏళ్లు పెద్దదైన అన్ హతవే అనే ఆమెను పెళ్ళాడాడు. వారికి ఇద్దరు ముగ్గురు పిల్లలు కలిగినాక షేక్స్పియర్ బతుకుతెరువు నిమిత్తం 1587 లో లండన్ మహానగరం చేరాడు. ఆయనకు కొద్దికాలంలోనే విజయం లభించింది.



William Shakespeare

షేక్స్పియర్ రచించిన మొదటి నాటకం "లవ్స్ లేబర్ లాస్ట్" దీనిని అతను 1590లో రాశాడు. అది లగాయతు తనజీవితాంతం దాకా సగటున ఏడాదికి రెండు నాటకాల చొప్పున షేక్స్పియర్ రచించాడు. ఆయన నాటకాలు రచించటమేగాక నటుడుగా కూడా రాణించి, తన నాటకాలతోబాటు ఇతరులు రచించిన నాటకాలలోకూడా పాత్రలు ధరించాడు.

షేక్స్పియర్ రాబడి హెచ్చింది. ఆయన గ్లోబ్ థియేటరులో పదవవంతు వాటాకొన్నాడు. అదే సమయంలో తన స్వగ్రామంలో 100 ఎకరాల పైచిలుకు సాగుభూమి కొన్నాడు, అక్కడే ఒక మంచి ఇల్లుకూడా కొనుక్కున్నాడు.

షేక్స్పియర్ నాటకాలకు గొప్ప పేరు వచ్చింది. ఆయన తన నాటక ప్రదర్శనాలను ఆనాటి బ్రిటిష్‌రాణి అయిన ఎలిజబెత్ రాణి ఎదట అనేక పర్యాయాలు ఇచ్చాడు. 1616 ఏప్రిల్ 23న విలియం షేక్స్పియర్ తన స్వగ్రామంలోనే చనిపోయాడు. ఆనాటినుంచి ఈనాటిదాకా ఆయన రచనలు ఇంగ్లీషు సారస్వతంలో అత్యున్నత స్థానం అలంకరించి ఉన్నాయి.

# చంద్రుడికి ఉపగ్రహం!

సెప్టెంబరు 12 న సోవియెట్ శాస్త్రవేత్తలు ఒక రాకెట్‌ను చంద్రుడిలో పడేలాగ ప్రయోగించారు, తిరిగి అక్టోబరు 4 న చంద్రుడిచుట్టూ తిరిగివచ్చేలాగ ఒక "ఆకాశస్థావరాన్ని" ప్రయోగించాను గనక చంద్రుడి చుట్టూ ఉపగ్రహాన్ని నెలకొల్పటం ఇప్పుడు మానవులకు సాధ్యమైన పనే. చంద్రుడి చుట్టూ తిరిగే ఉపగ్రహాలు చంద్రుడికి ఎంత దగ్గిరిగానైనా తిరగ వచ్చు. ఎందుకంటే చంద్రుడిలో గాలి లేదుగనక దాని నిరోధంవల్ల ఉపగ్రహం వేగం తగ్గి, అది చంద్రుడిపైన పడిపోయే భయంలేదు.

అయితే చంద్రుడిలో ఉన్న కొండలలో ఎత్తయిన శిఖరాలున్నాయి. అందుచేత కృత్రిమ ఉపగ్రహం ఆ కొండశిఖరాలకంటె ఇంకా ఎత్తుగా తిరుగుతూ చంద్రుడి చుట్టూ ప్రదక్షిణ చెయ్యాలి. ఇటువంటి ఉపగ్రహంవల్ల ప్రయోజనమేమిటి? అందులో ఒక టెలిస్కోపు ఉంచి చంద్రుడి పైభాగాన్ని గమనించే ఏర్పాట్లు చేయవచ్చు.

చంద్రుడిలో అసలు ఏపాటి వాతావరణమైనా ఉన్నదీ లేనిదీ ఉపగ్రహం బయటపెట్టేస్తుంది. ఎందుకంటె చంద్రుడిలో ఎంత పలచని గాలిగాని ఉన్నట్టయితే కృత్రిమ ఉపగ్రహం వేగం కొంచెంకొంచెమే తగ్గిపోతుంది. దాని వేగంలో మార్పునుబట్టి చంద్రుడిలోని వాతావరణం ఎంత దళంగా ఉన్నదీ మనకు తెలుస్తుంది. ఒకవేళ చంద్రుడిలో వాతావరణం బొత్తిగా శూన్యం అయినట్లయితే కృత్రిమ ఉపగ్రహం చంద్రుడిచుట్టూ ఎంత నిక్కచ్చిగా తిరుగుతుందంటే దాని సహాయంతో మనం మన గడియారాలను సరిదిద్దుకోవచ్చు!






యూరప్‌లో ఉండే పర్వతపంక్తులలో కెల్లా ఎత్తయినవి ఆల్ప్స్ పర్వతాలు. వీటి మధ్యను లూసర్న్ అనే ఒక పెద్ద సరస్సు ఉన్నది. స్విట్జర్లాండు ప్రజల స్వాతంత్ర్య పోరాటానికి ఈ సరస్సు రంగభూమి అయింది. ఈ పోరాటం సుమారు ఏడు వందల ఏళ్ల క్రితం జరిగింది.

లూసర్న్‌సరస్సు చుట్టూ ఉండే కొండలలో అనేక లోయలున్నాయి. ఈ లోయలలో నివసించే ప్రజలు ధైర్యవంతులు, స్వేచ్ఛాప్రియులు. అస్ట్రియాదేశానికి చెందిన రాజులు వారిని తమ అధీనంలో ఉంచుకుని. తాము నియోగించిన గవర్నర్లద్వారా పరిపాలన సాగిస్తూ ఉండేవారు. వీరి నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా చాలా పోరాటాలు సాగాయి. చివరకు ప్రజలు విజయం సాధించి ఒక స్వతంత్ర సమాఖ్య ఏర్పాటు చేశారు. అదే స్విట్జర్లాండుదేశం.

లూసర్న్ చుట్టూ ఉండే లోయలలోని గ్రామాలు జిల్లాలుగా విభజించబడి ఉండేవి. వాటిలో ఉరీ అనేది ఒకటి. ఈ జిల్లాకు చెందిన ఒకగ్రామంలో విలియమ్ టెల్ అనే వేటగాడు ఉండేవాడు. అతను షామాయ్ అనే కొండజింకలను వేటాడేవాడు. ఈ జింకల చర్మం అతి మెత్తగా ఉంటుంది, విలువైనది. అతని గురి అమోఘమైనది. షామాయ్ జింకలను కొండలపై వేటాడటం తేలికైన పనికాదు. అతను లాఘవంగా ఒక బండరాయినుంచి ఇంకొక బండరాయిపైకి దూకుతూ జింకలను తరిమి, ఒక్క బాణంతో జింకను పడగొట్టేవాడు. అతను ఉండే లోయలో అతనికి సరివచ్చే విలుకాడు లేడు. అతను ఒకరి జోలికీ సొంటికీ పోయే మనిషి కాడు. ఉదయంపూట షామాయ్ జింకలను వేటాడి, వాటి తోళ్లను లూసర్న్‌నగరంలో అమ్మి, ఆవచ్చిన డబ్బుతో

ఎ. విశ్వేశ్వరరావు




తన కుటుంబాన్ని పోషించుకుంటూ నిరాడంబరంగా జీవించేవాడు.

ఒక శీతాకాలపు ఉదయం విలియమ్ బెల్ వేటకు బయలుదేరి సాయంకాలానికల్లా ఒక జింకను కొట్టి భుజాన వేసుకుని, తరవాత ఒక అడవిబాతును కొట్టి రొండిన కట్టుకుని ఇంటిదారి పట్టి సరస్సువద్దకు చేరుకున్నాడు.

ఆ సమయానికి పెద్ద తుఫాను వచ్చే లక్షణాలు కనబడ్డాయి. బ్రహ్మాండమైన గాలి వీచి, సరస్సులో తాటి ప్రమాణాన అలలను లేపుతున్నది. ఆకాశాన కారు మేఘాలు కమ్ముకుంటున్నాయి. విలియమ్



బెల్ సరస్సువద్దకు వచ్చేసరికి అక్కడ ఉన్న బోటు వద్దకు మరొక మనిషి వచ్చి, తనను ఎలాగైనా సరస్సు దాటించమనీ, ఎంత డబ్బయినా ఇస్తాననీ బోటుమనిషిని వేడుకుంటున్నాడు.

"ఆ అలలు చూడు! తుఫాను వస్తున్నది. బోటు నడవదు. తుఫాను తగ్గినదాకా ఆగు," అంటున్నాడు బోటుమనిషి.

"గవర్నరు భటులు తరుముకు వస్తున్నారు. నేను దొరికానంటే ప్రాణాలతో వదలరు! నా ప్రాణం కాపాడు!" అంటున్నాడు ఆ మనిషి.

బోటుమనిషి చచ్చినా ఒప్పుకునేటట్టు లేడు. ఇదంతా చూసిన విలియమ్ బెల్ బోటులోకి దూకుతూ, ఆ మనిషితో, "రా, నేను నిన్ను దాటిస్తాను!" అన్నాడు.

రెండో మనిషి బోటులోకి ఎక్కాక విలియమ్ బెల్ బలంగా తెడ్డు వేస్తూ బోటును ఆ భయంకరమైన అలలమధ్యకు తీసుకుపోసాగాడు. బోటు సముద్రంమీద బెండులాగా ఆడిపోతున్నప్పటికీ బెల్ చాకచక్యంతో దానిని నడపసాగాడు. బోటు ముప్పై బారలు వెళ్లిందో లేదో, గవర్నరు భటులు సరస్సుతీరాన్ని చేరుకున్నారు. కాని ఇప్పుడు వారు చేసేది ఏమీ లేదు.





"వాళ్లు నిన్నెందుకు వేటాడుతున్నారు? ఏం జరిగింది?" అని విలియమ్ టెల్ తాను కాపాడిన మనిషిని అడిగాడు.

"నేను స్వతంత్రుణ్ణని గవర్నరుకు నామీద గుర్రు. పైగా ఆ దుర్మార్గుడు నా భార్యపైన కన్నువేశాడు. నేను అడవిలో కట్టెలు కొట్టుకుంటూండగా గవర్నరు మా ఇంటికి వచ్చి నా భార్యను అనరాని మాటలని, స్నానానికి నీరు కాచమన్నాడట. అది నన్ను వెతుక్కుంటూ వచ్చి నాతో జరిగిన సంగతి చెప్పింది. నాకు కోపంలో వళ్లు తెలియలేదు. ఆ గొడ్డలితోనే ఇంటికి పోయి వాడి తల రెండుగా చీల్చాను!" అన్నాడు ఆ మనిషి. విలియమ్ టెల్ ఏమీఅనక మరింత బలంగా తెడ్డు వేయసాగాడు. ఆతని జిల్లాలోకూడా స్వతంత్రులైన కాపులున్నారు. వారికి తమ చక్రవర్తిపై అభిమానం లేకపోలేదు. కాని వారికి గవర్నరుగా ఉంటున్న గెస్లర్ అనేవాడు వారి స్వాతంత్ర్యాన్ని నిర్మూలించటానికి సర్వవిధాలా ప్రయత్నిస్తున్నాడు.

విలియమ్ టెల్ బోటును ష్విజ్ జిల్లాలోని బ్రునెన్ గ్రామానికి చేర్చి, తాను కాపాడిన మనిషిని ఆ జిల్లాలోని స్వతంత్ర పౌరనాయకుడి ఇంట ఉంచి, తన ఇంటి దారి పట్టాడు.



గవర్నరు గెస్లర్ అధికారోన్మాది. మూడడుగుల మందం గల గోడలతో ఒక బ్రహ్మాండమైన కోట నిర్మించి, స్వేచ్ఛాకాముకుల నందరినీ అందులో బందీలుగా ఉంచాడు. ప్రజలపై నిరంకుశాధికారం చలాయించాలని అతని ఉద్దేశం. స్వతంత్రులుగా ఉన్న వారిని ఖైదుచెయ్యటానికి గెస్లర్ రకరకాల ఆలోచనలు చేశాడు.

ఒకనాడు గెస్లర్ భటులు అల్ట్‌డార్ఫ్ అనే ఒక గ్రామంలో నడివీధిన ఒక కర్రపాతి దానిపైన గవర్నరుగారి టోపీ ఉంచారు. అది ఆకుపచ్చ టోపీ. దానిలో ఒక ఈక ఉన్నది. తరవాత వాళ్లు తప్పెట్లు మోగించి

జనాన్ని పోగుచేసి, వారితో, "ఆడవాళ్లూ, మగవాళ్లూ—అందరూ వినండి! ఇటుగా వెళ్లే ప్రతి మనిషీ ఈ టోపీముందు మోక రించి దీనికి వందనం చెయ్యాలి. అలా చెయ్యనివాళ్లు గవర్నరుగారికీ, చక్రవర్తి గారికీ అపచారం చేసినట్టే! అలాంటి ద్రోహు లను తీసుకుపోయి ఖైదు చేస్తాము!" అని చాటించారు.

దారే వెళ్లేవాళ్లచేత టోపీకి వందనం చేయించటానికిగాను ఇద్దరు భటులు ఆయు ధాలతో నిలబడ్డారు. కాని పెద్దవాళ్లెవరూ అటుగా రాలేదు. చాటింపు వినిఉండటం చేత వారు ఆ దారి వదిలిపెట్టి చుట్టు తిరిగి వెళ్లసాగారు. కొంతమంది పిల్లలుమట్టుకు కర్రచుట్టూ చేరి కేరింతాలు కొడుతూ మధ్య మధ్య మోకరించి టోపీకి వందనం చేస్తూ ఆడుకుంటున్నారు.

గెస్లర్ జారీచేసిన ఈ ఉత్తరువు మూడు జిల్లాలవారినీ ఆగ్రహపరిచింది. ఒకనాటి రాత్రి వారు సరస్సు ఒడ్డున ఉన్న ఒక అరణ్యంమధ్య మైదానంలో సమావేశమై రహస్య సమాలోచన చేశారు. వారు చేసిన రహస్య నిర్ణయమేమంటే రాగల సంవత్స రాది ముందురాత్రి అన్ని ప్రాంతాలవారూ తమ తమ ప్రాంతాలలో గల కోటలపై హఠాత్తుగా దాడి చేయటం. ఈ నిర్ణయం



సమావేశంలో పాల్గొన్నవారికి తప్ప మరొక పురుగుకైనా తెలియదు.

విలియమ్ టెల్ ఈ సమావేశానికి వెళ్ల లేదు. అతనికి ఈ తిరుగుబాటు ప్రయత్నం గురించికూడా ఏమీ తెలియదు. ఒకనాడు అతను తన కొడుకును వెంటబెట్టుకుని ఆల్ట్‌డార్ఫ్ అంగళ్లకు రావటం తటస్థించింది. అతను కుడిచేతిలో తన విల్లు పట్టుకుని, ఎడమచేత కొడుకు చెయ్యి పట్టుకుని వీధి వెంట నడిచి వస్తుంటే ప్రజలు అతన్ని చూసి గర్వపడ్డారు.

విలియం టెల్ టోపీ పెట్టిఉన్న కర్ర పక్కగా నడిచి రెండడుగులు వేసేసరికి అతని దారికి రెండు ఈటెలు అడ్డంగా వచ్చాయి. భటులు అతన్ని పట్టుకుని అతని చేతులు గొలుసులతో బంధించటానికి ఉపక్రమిస్తూ, "గవర్నరుగారి ఉత్తరువు ఉల్లంఘించావు, జైలుకు పద!" అన్నారు.

విలియమ్‌టెల్ తన బలిష్ఠమైన చేతులతో భటుల ఈటెలను పక్కకు నెట్టుతూ, "నేను స్వతంత్రుణ్ణి. దేవుడికీ, చక్రవర్తికీ, ఆయన ప్రతినిధి అయిన గవర్నరుకూ వందనం చేస్తాను; టోపీలకు వందనం చెయ్యను!" అన్నాడు.

ఈ సమయానికి గవర్నరుగారు తన పరివారంతో సహా అటుకేసి వచ్చాడు;





యుద్ధానికి వెళ్లేవారిలాగా అందరూ కవచాలు ధరించి ఆయుధాలు పట్టిఉన్నారు. వారిని చూడగానే రక్షకభటులకు నోరు పెగిలింది.

"ఊఁ, జైలుకు పద!" అని వారు విలియమ్ టెల్ పైన ధాష్టీకంచేశారు.

ఇంతలోనే టెల్‌ను విడిపించటానికి నగరంలోని పౌరులందరూ ఆవేశంతో పరిగెత్తి వచ్చి చుట్టూ మూగారు.

"స్నేహితులారా, ఆవేశపడకండి. విడిపించుకోదలిస్తే నాకు ఒకరి సహాయం అవసరం లేదు," అని టెల్ చుట్టూ చేరిన పౌరులను హెచ్చరించాడు.

ఇంతలో గవర్నరు పరివార సమేతంగా ఈ గుంపును చేరుకున్నాడు. అక్కడ చేరిన పౌరులలో రహస్యప్రమాణం చేసినవారు అనేకమంది ఉన్నారు. గవర్నరుపై బడి చిత్రవధ చేయాలన్న కోరికతో వారి రక్తం ఉడికిపోతున్నది. కాని వారిలో ఒక్కరివద్దా ఏ ఆయుధమూ లేదు.

గవర్నరు గెస్లర్‌కు విలియమ్‌టెల్ పైన కూడా ఆగ్రహమే. ఎందుకంటే అతను స్వతంత్రుడు. ఆయన టెల్‌తో, "నీవు నా ఆజ్ఞను ఉల్లంఘించావు. నీకు మరణశిక్ష విధించగలను!" అన్నాడు.

"అయ్యా, క్షమించండి. మేము ఉత్త టోపీకి వందనం చెయ్యాలని మీరుమాత్రం ఎలా కోరుతారు. మేము స్వతంత్రపౌరులం," అన్నాడు విలియమ్‌టెల్.

"నీవూ, నీ మిత్రులూ ఆయుధాలు ధరించి తిరుగుతారు. ఊరీ పౌరులు సాయుధులై తిరగరాదని నేను శాసించి ఉన్నాను. నా శాసనాన్ని ధిక్కరించటం ఏమిటో నీకు తెలియజెప్పుతాను—నీ బాణంతోనే నిన్ను శిక్షిస్తాను. చూడు! వీడు నీ కొడుకే కాదూ?" అంటూ గవర్నరు గెస్లర్ తన భటులతో, "ఈ కుర్రవాణ్ణి పట్టుకుపోయి దూరంగా ఆ చెట్టుకింద నిలబెట్టండి. ఈ ఆపిల్





పండు వాడి నెత్తిన పెట్టండి. వాడినుంచి ఎనభై అంగల దూరం కొలవండి. ఆ దూరంనుంచి విలియమ్ టెల్ తన బాణంతో తన కొడుకు నెత్తిన ఉన్న పండును కొడతాడు. పండును గురిగా కొట్టాడా, ఇతన్ని వదిలేస్తాను; గురితప్పి కొడుకును చంపాడో, ఇతన్నికూడా చంపేస్తాను!" అన్నాడు.

టెల్ గవర్నరుకేసి గాభరాతో చూశాడు. అతనిమీదికి ఈటెలు బారుచేసి ఉన్నాయి. అతనికి చాలా కోపం వచ్చింది. గవర్నరును అమాంతం గుర్రంమీదినుంచి లాగి కింద పడేసి తన్నుదామనుకున్నాడు గాని, తన కొడుకు ప్రాణాలకు ముప్పు వస్తుందని జంకాడు. అతను తన పౌరుషాన్నంతా దిగమింగి, గవర్నరు ముందు మోకరించి, "బాబూ, తెలియనివాణ్ణి! క్షమించండి! నేను బుద్ధిపూర్వకంగా మీ ఉత్తరువు ఉల్లంఘించలేదు. నా దారిన నన్ను పోనివ్వండి!" అని ప్రాధేయపడ్డాడు.

గవర్నరు కనికరించలేదు. చుట్టూ ఉన్న ప్రజల ముఖాలలో క్రోధోద్రేకం ఆయనకు కనిపించింది. అందరికీ గుండెబెదురు కలిగించటాని కిది మంచి అవకాశం.

గవర్నరు భటులు కుర్రవాణ్ణి పట్టుకుని చెట్టువద్దకు లాక్కుపోయి నిలబెట్టారు. వాళ్లు తన కళ్లకు గంతకట్ట ప్రయత్నిస్తే వాడు పెనగులాడి, "వద్దు! మా నాన్న బాణం నన్నేమీ చెయ్యదు, నాకేమీ భయం లేదు!" అని అరిచాడు.

టెల్ తనకు నిర్ణయించిన స్థానంలో మోకరించి విల్లు ఎక్కుపెట్టి గురిచూసి, బాణం దించేసి, "నావల్ల కాదు!" అని మూలిగాడు.

గవర్నరు అతనితో వెటకారంగా, "నీవల్ల కాదేం? హంతకులను తుఫాను సమయంలో పడవల్లో దాటించటం మాత్రమే నీకు చాతనవునా? ఇతరులకు సాయం చెయ్యగలవాడివి, నీకు నీవు చేసుకో! బాణం





వదులుతావా? నీ ప్రాణాలూ, నీ కొడుకు ప్రాణాలూ వదులుతావా? తేల్చుకో!" అన్నాడు. విలియమ్‌టెల్ గుండెలో ఉన్న ఆరాటమంతా ఒక్కసారిగా అణగిపోయినట్టయింది. అతను ధైర్యంగా అంగలు వేసుకుంటూ తనకూ, తన కొడుకుకూ మధ్య ఉండే దూరం కొలిచాడు. తరవాత తనకూ, గవర్నరుకూ మధ్య ఉండే దూరం కొలిచాడు. యథాస్థానానికి వచ్చి సంకోచం లేకుండా రెండు బాణాలు తీసి, ఒకటి రొండిలో దోపుకుని, రెండవది ఎక్కుపెట్టాడు. అంతమంది జనం ఉన్నా చిరుగాలి వీచినంత చప్పుడుకూడా లేదు.

విలియంటెల్ తాను ఎక్కుపెట్టిన బాణాన్ని వదిలాడు. అతని కొడుకునెత్తిన ఉన్న ఆపిల్‌పండు కోసినట్టుగా రెండు ముక్కలయింది. ఒక్కసారిగా జనం హర్షధ్వానాలు చేశారు. వారు విలియమ్‌టెల్‌ను చుట్టుముట్టిన ఈ టెలవాళ్లను పక్కకు నెట్టేసి, ముందుకు తోసుకు రావటానికి యత్నించారు.

ఆ జనాన్ని దూరంగా తరమమని గవర్నరు గెస్లర్ తన సిబ్బందిని పురమాయించాడు. ఆయన టెల్‌తో, "నీ గురి నిజంగా అద్భుతం! కాని రెండు బాణాలు తీశావెందుకు?" అన్నాడు.



"అది విలుకాళ్ల ఆచారం," అని టెల్ గొణిగాడు.

"నిజం చెప్పు! నిన్నేమీ చెయ్యనులే!" అన్నాడు గెస్లర్.

విలియమ్ టెల్ గట్టిగా అరిచాడు. "నీకు నిజం కావాలా? అయితే విను. ఆ రెండో బాణం నీకోసం తీశాను. మొదటి బాణం పండుకు తగలక నా కొడుక్కు తగిలి ఉంటే, మరుక్షణం రెండోది నీ గుండెను దూసి ఉండేది. కనీసం రెండవదైనా గురిగా తగిలి ఉండేది!" అన్నాడతను, దిశలు దద్దరిల్లేట్టు. ఈ మాటలలు వింటూనే గవర్నరు గెస్లర్ పాలిపోయాడు. ఆయన తన భటులతో, "ఈ దుర్మార్గుణ్ణి పడదోసి గొలుసులతో బంధించండి!" అన్నాడు. అతన్ని తీసుకుపోయి తన దుర్గంలో ఉన్న ఖైదులోని చీకటికొట్టులో వేసి చిత్రహింసలు చెయ్యమని ఆయన ఉత్తరువిచ్చాడు.

గవర్నరుగారి బోటు రేవులో సిద్ధంగా ఉన్నది. అది ప్రభుత్వ చిహ్నాలు గల బోటు. దానికి తెడ్లు వేసేవారు పదహారు మంది. టెల్‌ను గొలుసులతో బంధించి దోనె కడుపులో పడేశారు. గెస్లర్ సంతోషానికి మితి లేదు; తనకు పక్కలో బల్లెంలాటివాడు బందీ అయాడు!





గవర్నరు గెస్లర్‌ను ఎక్కించుకుని బోటు కదిలింది. సరస్సూ, చుట్టూ ఉన్న కొండలు ప్రశాంతంగా ఉన్నాయి. పిల్లగాలికి సరస్సులో చిన్న చిన్న అలలు లేస్తున్నాయి. దక్షిణాన హఠాత్తుగా మబ్బులు కనిపించాయి. ఆ గాలి వెంబడి అకస్మిక తుఫానులు వస్తాయని గెస్లర్ బోటుకు తెడ్లువేసే ఆస్ట్రియనులకు తెలియదు.

తుఫాను రానే వచ్చింది. దాని ఉధృతికి పడవవాళ్లు బెదిరిపోయారు. చూస్తూండగానే తుఫాను మరింత తీవ్రమయింది. రెండు తెడ్లు అలల తాకిడికి పెళ్లున విరిగిపోయాయి. చుక్కానివాడు చుక్కాని పట్టలేక వదిలేశాడు. గవర్నరుగారి పడవ సరస్సు మధ్యన తుఫానుచేతి కీలుబొమ్మలాగా అయిపోయింది.

గవర్నరు గెస్లర్ తన ప్రాణాలపై ఆశ వదులుకున్నాడు. తుఫానువిసురుకు పడవ వెళ్లి ఏ కొండను తాకినా తాకవచ్చు. చుక్కాని పట్టేవాడు గవర్నరువద్దకు వెళ్లి, "మహాప్రభూ, మనం ప్రాణాలతో బయటపడాలంటే ఆ విలియమ్‌టెల్ సంకెళ్లు విప్పి చుక్కాని పట్టమనండి. ఆ పని వాడివల్ల తప్ప మరొకరివల్ల కాదు!" అన్నాడు.

చేసేది లేక గవర్నరు తల ఊపాడు. టెల్‌ను విడిపించి చుక్కానిదగ్గిర కూచోబెట్టారు. "మీ సత్తువకొద్దీ తెడ్లు వెయ్యండి. మిగిలినది నేను చూస్తాను!" అన్నాడు విలియమ్‌టెల్.

తెడ్లు వేసేవారికి కొంచెం గుండెధైర్యం వచ్చింది. చుక్కాని టెల్ చేతికి రాగానే పడవకు మళ్లీ నడక అంటూ ఏర్పడింది, అతను వెయ్యి కళ్లతో చుట్టూ చూస్తున్నాడు. ఈ సరస్సు తీరాన ఒకచోట పది అడుగుల నిడివిగల రాతిపలక నీటిలోకి చొచ్చుకుని వచ్చింది. అది నీటిమట్టానికి దిగువగా ఉండటంచేత కొత్తవారికి కనిపించదు. టెల్ గవర్నరు బోటును దానికేసి నడిపాడు. తన



విల్లూ, బాణాలూ పట్టుకుని ఉన్న భటుడు తనకు సమీపంలోనే ఉండటంకూడా టెల్ గమనించాడు.

గవర్నరు పడవయొక్క ముందుభాగం పెద్ద వేగంతో రాతిని ఢీకొన్నది. మరుక్షణం అది గుండ్రంగా తిరిగి, చుక్కాని ఒడ్డుకేసి వచ్చింది. ఆ క్షణంలో టెల్ భటుడిపై లంఘించి తన విల్లూ, బాణాలూ తీసుకుని, నీటిమట్టానికి ఉగువగా ఉన్న రాతిపైకి దూకేశాడు.

గెస్లర్ లేచి నిలబడబోయి, అలల తాకిడికి పడవ ఒరగగానే కిందపడ్డాడు. ఆయన అంగరక్షకులు ఈటె తీసి విసిరేలోపుగా విలియమ్ టెల్ ఒడ్డున ఉన్న పొదలచాటున మాయమైపోయాడు. చుక్కాని పట్టేమనిషి లేనందున పడవ అలలతోబాటు నీటిమీద ఆడసాగింది.

అలా తప్పించుకుపోయిన విలియమ్ టెల్ ఇంటికి పోలేదు. అతను కొండదారుల వెంట బ్రునెన్‌కు వెళ్లి అక్కడ భోజనం చేశాడు. అక్కడే అతనికి గవర్నరు వార్త కూడా తెలిసింది; గవర్నరుగారి బోటు సరస్సులో మునగలేదు, గవర్నరుగారు క్షేమంగా బ్రునెన్ చేరాడు. ఆయన అక్కడి నుంచి తన కోటకు వెళతాడు.




విలియం టెల్ ఆ రాత్రంతా కొండల మీదుగా, అరణ్యాలమధ్యగా నడిచి తెల్లవారేసరికి గవర్నరుగారి కోటకు వెళ్లేమార్గం చేరుకున్నాడు. ఆయన కోటకు అది తప్ప వేరుమార్గం లేదు. ఆ మార్గం ఒక సన్నని లోతైన కనుమగుండా పోతుంది. దారికి అటూ ఇటూ దట్టమైన పొదలున్నాయి. టెల్ ఆ పొదలలో దాక్కుని గవర్నరు రాకకు ఎదురుచూడసాగాడు.

చాలా గంటలు గడిచాక గవర్నరు పరివారం అటుగా వచ్చింది. టెల్ తనదగ్గిర మిగిలిఉన్న కొద్ది బాణాలలో ఒకటి ఎక్కుపెట్టి గురిచూసి విడిచాడు. అది సూటిగా

గెస్లర్ గుండెలో నాటుకున్నది. గవర్నరు తన గుర్రంపైనుంచి చచ్చి పడిపోయాడు. కాని చచ్చేముందు ఆయన తనను కొట్టిన వాణ్ణి కళ్లారా చూసి మరీ పోయాడు.

గవర్నరు భటులు విలియమ్ టెల్ కోసం వేటాడారు. ఒక పెద్ద కొండరాయికింద దాక్కుని విలియమ్ టెల్ వారినుంచి తప్పించుకున్నాడు. తరవాత అతను తన ఇల్లు చేరుకున్నాడు.

గవర్నరు మరణించిన వార్త అప్పటికే ఉరీజిల్లాకు చేరింది. జనం వీధులలో గుంపులు గుంపులుగా చేరి తమపైన నిరంకుశంగా అధికారం చలాయించిన గవర్నరు గెస్లర్ పోయిన సంగతి బాహటంగా మాట్లాడుకున్నారు

విలియమ్ టెల్‌ను చూడగానే ప్రజలు ఆనందోత్సాహంతో చుట్టుముట్టి తమ స్వాతంత్ర్యదాతగా ఊరేగించాలని ప్రయత్నించారు గాని, అతను వారి ఉత్సాహాలలో పాల్గొనక తన భార్యవెంట ఒంటరిగా ఇంటికి వెళ్లిపోయాడు.

మర్నాడు అతను ఏమీ జరగనట్టే షామాయ్ జింకలను వేటాడటానికి కొండల పైకి వెళ్లాడు.

కొండమీదినుంచి చూస్తే అతనికి గవర్నరుగారి కోట ఉండవలిసిన చోట రాళ్ల గుట్టలుమాత్రమే కనిపించాయి.

విలియమ్ టెల్ చేసిన సాహసకృత్యం గురించి వినగానె ఎక్కడెక్కడి ప్రజలు అక్కడక్కడి గవర్నర్ల కోటలపై దాడిచేసి నేలమట్టం చేసేశారు.

తరవాత మూడు జిల్లాలవారు ఏకమై ఒక రాజ్యాంగం తయారు చేసుకున్నారు. ఈనాటివరకూ ఆ రాజ్యాంగం ప్రకారం స్విట్జర్లాండులో ప్రజాప్రభుత్వం అమలు జరుగుతున్నది. ఆ ప్రజాప్రభుత్వానికి బీజం విలియమ్ టెల్ బాణమని ఇప్పటికీ అక్కడి పౌరులు చెప్పుకుంటారు.








హిమయుగం నాటి జూలు ఖడ్గమృగాలు యూరపులోని మంచు ప్రాంతాలలో తవ్వుతుంటే దొరికాయి. ఇంతకాలమూ వాటి కళేబరాలు మంచులో చెక్కుచెదరకుండా ఉన్నాయి.





ఇవి శాకాహారులు. వీటి దంతాల సందున ఆకు ముక్కలు కనిపించాయి. ఈనాటి ఖడ్గమృగాలకు రోమాలు లేవు. - కాని ఆనాటి జంతువులను చలినుంచి జూలు కాపాడింది.



ముట్టెలపైన గల వీటి కొమ్ములు చాలా ప్రమాదకరమైనవి. అయినప్పటికీ ఆ కాలపు మనుషులు ఆహారంకోసం వీటిని వేటాడారు, తమ గుహలలో వీటి బొమ్మలుకూడా వేశారు.

# ప్రాచీన ప్రపంచాద్భుతాలు







1. "కలోసస్"—రోడ్స్ అనే చోట ఉండిన హీలియోస్ (సూర్యుడి) కంచు విగ్రహం. ప్రతిష్ఠ క్రీస్తుపూర్వం 260 లో. ఎత్తు 120 అడుగులు.
2. "డయానా" ఆలయం—ఎఫెసస్ అనేచోట ఉండేది. వైశాల్యం 80,000 చ. అ.




3 అలెగ్జాండ్రియా దీప స్తంభం—ఎత్తు 400 అడుగులు. తెల్లరాతితో కట్టిన అనేక అంతస్తుల కట్టడం. నిర్మాణం క్రీ. పూ. 3 వ శతాబ్దిలో. దీని నిర్మాత ఈజిప్టురాజు అయిన రెండవ టోలమీ.

# ప్రాచీన ప్రపంచాద్భుతాలు







4. ఈజిప్టు పిరమిడ్‌లు — చియోప్స్ పిరమిడ్ ఎత్తు పూర్వం 481 అడుగులు. (ఇప్పుడు 451 అడుగులు). 6,600 ఏళ్లక్రితం తయారైన ఈ పిరమిడ్‌ను ఒక లక్షమంది బానిసలు 20 ఏళ్లపాటు నిర్మించారు.
5. జూపిటర్ విగ్రహం — ఒలింపియావద్ద గల దేవాలయంకోసం ఫిడియాస్ నిర్మించిన ఈ విగ్రహం అద్భుత శిల్పంగలదట.







6. బాబిలోన్ ఆకాశవనాలు — నెబుచాడ్నజార్ 75 అడుగులఎత్తున 4 ఎకరాలమేర తోటలు నిర్మింపజేశాడు.
7. మౌసోలస్ సమాధి — 111 అడుగుల చుట్టుకొలతా, 140 అడుగుల ఎత్తుగల ఈ సమాధిని క్రీ. పూ. 4 వ శతాబ్దిలో మౌసోలస్ భార్య కట్టించింది.

* ఈనాడు పిరమిడ్లు తప్ప మిగిలినవన్నీ పోయాయి.




[జూలియస్ సీజరు క్రీస్తుకు పూర్వం 100 సంవత్సరాలక్రితం జన్మించాడు. ఆయన 26 వ ఏట రాజకీయజీవితం ప్రారంభించి రోమును పరిపాలించే "త్రిమూర్తుల" లో ఒక డయాడు. సీజరు రోము సామ్రాజ్యపు పడమటి ప్రాంతాన్ని, గాల్ దేశంతో సహా పాలించాడు. పాంపే అనేవాడు మధ్యప్రాంతాన్నీ, దక్షిణప్రాంతాన్నీ పాలించాడు. క్రాసస్ అనే వాడు తూర్పు ప్రాంతాన్నీ, పర్షియానూ పాలించాడు. సీజరు తన సమర చాతుర్యంతో రోము సామ్రాజ్యాన్ని రెట్టింపు చేశాడు. సీజరు ప్రతిభ పెరిగిపోతున్నదని అసూయ చెంది పాంపే అతని సేనలను ఉపసంహరించేలాగు శాసనం చేయించాడు. సీజరు ఈ శాసనాన్ని లక్ష్యపెట్టక రోమునగరంపైకి సైన్యాలతోసహా ఎత్తివచ్చాడు. పాంపే భయపడి పారి పోయాడు. సీజరు పాంపే సైన్యాలను నిర్మూలించి, ఆఫ్రికాలోనూ, ఉప ఆసియాలోనూ గల తన శత్రువులతో యుద్ధాలు చేయబోయి, అందులో పూర్తి విజయాన్ని సాధించాడు.]

రోమ్‌నగరం కోలాహలంగా ఉంది. జూలియస్ సీజర్ విజయుడై యుద్ధాలనుంచి తిరిగి వస్తున్నాడు. ప్రస్తుతం ప్రజల కంటికి అతను దేవుడిలాటివాడు. వారు సీజర్‌ను చూడటానికి వీధులలో గుంపులుగా కూడారు.

అయితే ఆ నగరంలో సీజరు వస్తున్నాడంటే దిగులుపడినవారుకూడా ఉన్నారు. ఎందుకంటే, రోమునగరంలో అమలులో ఉన్నది ప్రజాతంత్రం; సీజరు ప్రజాతంత్రానికి స్వస్తిచెప్పి, తాను చక్రవర్తి అయి నిరంకుశ పరిపాలన సాగించుతాడని వారి భయం. సీజరును దేవుడేనని భావించే అమాయిక ప్రజలు, అతను కిరీటం పెట్టుకుంటానంటే కాదంటారా?

ఇలా భయపడినవారిలో సీజరంటే గిట్టనివాళ్ళుకూడా ఎంతోమంది ఉన్నారు.

విలియం. షేక్స్పియర్

వారిలో కాసియస్ అనేవాడు ముఖ్యుడు. ఇతను మార్కస్ బ్రూటస్‌తో సీజర్ మూలంగా రోముకు ప్రమాదం ఉన్నదని సూచనగా అన్నాడు. సీజరు చక్రవర్తి కావటానికి యత్నిస్తాడన్న అనుమానం బ్రూటసుకుకూడా ఉన్నది. అయితే అతను సీజరుకు ఆప్త మిత్రులలో ఒకడు. అయినప్పటికీ అతను అన్నిటికన్న దేశంయొక్క క్షేమాన్ని ప్రధానంగా గణించే అపార దేశాభిమాని.

ప్రజలు సీజరును ఎంత గౌరవించేవారో బ్రూటసునుకూడా అంతగానూ గౌరవించేవారు. బ్రూటస్ అంత పెద్దమనిషి, స్వార్థ రహితుడు, ఉదార స్వభావుడు. అందుకే కాసియస్ బ్రూటసును తమ పక్షాన చేర్చుకోవటానికి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం ఫలించిందికూడానూ.

సీజరును అంతమొందించటానికి ఒక కుట్ర జరిగింది. బ్రూటస్ కేవలం దేశక్షేమం కోరి ఈ కుట్రలో చేరటానికి ఒప్పుకోవటమే గాక, కుట్రదారులకు నాయకత్వం వహించటానికికూడా సిద్ధపడ్డాడు.

ఈలోపుగా జూలియస్ సీజరు వైభవంగా రోమునగరానికి వచ్చాడు. ఆయన గౌరవార్థం వేడుకలూ, ఆటల పోటీలూ జరిగాయి. ప్రజలు ఆనంద సముద్రంలో ఓలలాడారు. సీజరును చుట్టుముట్టిన జనంలోనుంచి ఒక



త్రికాలజ్ఞుడు, "సీజర్, మార్చి 15 వస్తుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు. ఈ హెచ్చరికను సీజరు లక్ష్యపెట్టక, "పిచ్చివాడు, పోనివ్వండి!" అన్నాడు.

వ్యాయామక్రీడలు జరిగేచోట సీజరుకు మార్కస్ ఆంటోనియస్ అనే అభిమాని రాజచిహ్నంలాటి కిరీటాన్ని బహూకరించాడు, కాని సీజరు దాన్ని నిరాకరించాడు. ఇలా మూడుసార్లు ఆంటోనియస్ కిరీటాన్ని ఇవ్వటమూ, సీజరు నిరాకరించటమూ చూసి ప్రజలు హర్షధ్వానాలుచేశారు.

ఒకనాటి రాత్రి చీకటిచాటున కుట్రదారులందరూ బ్రూటస్ ఇంటివద్ద సమావేశమై జూలియస్ సీజరును బహిరంగంగా హత్య చేయ నిర్ణయించారు. మిగిలినవాళ్లు ప్రమాణాలు చేయాలనుకున్నారుగాని బ్రూటస్ సమ్మతించలేదు. "మనం చెయ్యదలుచుకున్న పనికి దేశక్షేమమూ, ప్రజాతంత్రాభిమానమూ తగిన ప్రేరణలు కావా? వేరే ప్రమాణాలు దేనికి? ప్రమాణాలకు కట్టుబడకుండా మనం ఈపని చెయ్యలేనిపక్షంలో ఈ ప్రయత్నం మానటమే ఎంతో మేలు," అన్నాడాయన.

"మార్కస్ ఆంటోనియస్‌కు సీజరుపైన అపారమైన విశ్వాసం. సీజరు మరణించాక అతను శత్రుశేషంగా తయారై మనకు





పక్కలో బల్లెమవుతాడు. అందుచేత అతనిని కూడా చంపెయ్యటం అన్నివిధాలా క్షేమం," అన్నాడు కాసియస్.

దీనికికూడా బ్రూటస్ సమ్మతించలేదు. "మనం హంతకులలాగా తయారుకావటం భావ్యంకాదు. మార్కస్ ఆంటోనీ సీజరుకు కుడిభుజమే అయినా రోము ప్రజాతంత్రానికి అపాయం అతనివల్ల కలగదు. సీజరు ఎప్పుడు పోయాడో అతని భుజాలూ, మెడా, కాళ్ళూ అప్పుడే నిర్వీర్యమైపోతాయి," అన్నాడాయన.

సీజరును చంపటానికి ఇంకెవరెవరు కుట్రలో చేరే అవకాశం ఉన్నదీ అంచనా వేసుకుని వారినందరినీ కలుపుకోవటానికి కుట్రదారులు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి సీజరుభార్య పీడకలలు కన్నది. ఆమె నిద్రలో మూడుపర్యాయాలు, "రక్షించండి! సీజరును చంపేస్తున్నారు!" అని కేకలుపెట్టింది. తెల్లవారినాక ఆమె తన భర్తతో, "ఇవాళ ఇల్లు కదలవద్దు," అన్నది. సీజరు మొదట నిర్లక్ష్యంగానే ఉన్నాడుగాని చివరకు భార్య చెప్పినట్టు చేయటానికి సమ్మతించాడు.

ఇంతలో సీజరును రాజ్యభవనానికి తీసుకుపోవటానికి ఒక కుట్రదారు వచ్చాడు. సీజరు అతనితో, "నేనీవేళ రాను," అని చెప్పాడు.

"అదేమిటి? ఇవాళ సెనెటర్లు సీజరుకు కిరీటం ఇవ్వ నిశ్చయించారు. మీరు ఈ సమావేశం వాయిదావేస్తే, తిరిగి సమావేశమయేనాటికి వారీ బుద్ధిన ఉంటారని ఏమిటి? సీజరు భయపడ్డాడని నలుగురూ అనుకుంటే అది మాత్రం ఏమంత కీర్తికరంగా ఉంటుంది?" అన్నాడు కుట్రదారు. ఇంతలోనే మిగిలిన కుట్రదారులుకూడా సీజరును తీసుకుపోవటానికి వచ్చారు. సీజరు తన భార్యతో భయపడవద్దని చెప్పి రాజ్యభవనానికి బయలుదేరాడు.





సీజరును హత్యచేయటానికి జరిగిన కుట్ర ఎంత రహస్యంగా ఉంచబడినప్పటికీ అది ఒక పౌరుడు పసికట్టి, "నిన్ను బ్రూటస్, కాసియస్ మొదలైనవారు హత్య చేయబోతు న్నారు! జాగ్రత్త!" అని ఒక ఉత్తరం రాసి సీజరువచ్చే దారిలో పొంచిఉండి, దాన్ని ఎలాగో సీజరు చేతిలో పెట్టాడు. కాని సీజరు ఆ వుత్తరాన్ని విప్పి చదువుకోలేదు.

సీజరు రాజ్యసభలోకి రాగానే అక్కడ ప్రజాప్రతినిధులందరూ గౌరవంగా లేచి నిల బడ్డారు. సీజరు వెళ్ళి తన ఆసనంలో కూచు న్నాడు. కుట్రదారులు సీజరును సమీపించి అతనికి ఏవో అర్జీలు సమర్పించుకునేవారి లాగా ఆయనను చుట్టుముట్టి, ఒకరితరవాత ఒకరు ఆయనను కత్తులతో పొడిచారు. అందరికన్నా ఆఖరున బ్రూటస్ పొడిచాడు.

"నువ్వుకూడానా, బ్రూటస్!" అంటూ సీజరు పడిపోయి ప్రాణాలు వదిలాడు. ఆ రోజే మార్చి 15 వ రోజు!

ఈ దారుణ హత్య కనురెప్పపాటులో జరిగింది. ప్రజాప్రతినిధులు భయాశ్చర్యా లతో స్తంభించిపోయి ఏమీ చెయ్యలేక పోయారు. ఇదంతా కళ్లారా చూసిన మార్కస్ ఆంటోనీ భయపడి తన ఇంటికి పారి పోయాడు. అతను ఒక మనిషిని బ్రూటస్ వద్దకు పంపించి, "నేను బ్రూటస్ అంటే గౌరవం గలవాణ్ణి, సీజరును ప్రేమించిన వాణ్ణి. సీజరు హత్యకు కారణమేమిటో నాకు తెలిసినట్టయితే నేను బ్రూటస్ అడుగుజాడ లలో నడవటానికి సిద్ధంగా ఉన్నాను. నా కేమీ అపాయం జరగదని బ్రూటస్ అభయం ఇచ్చేపక్షంలో నేను అక్కడికి వచ్చి మాట్లాడ తాను," అని బ్రూటస్‌తో చెప్పించాడు.

"మీ యజమాని పైన నాకు చాలా గౌరవం ఉన్నది. ఆయనకు ఏమీ అపాయం కలగదు. ఆయన అనుమానాలను నేను తీర్చుతానని చెప్పు!" అని బ్రూటస్ ఆంటోనీ మనిషితో అన్నాడు.

అంటోనీ రాజ్యభవనానికి వచ్చాడు, సీజరు శవాన్నిచూసి ఏడిచాడు, హంతకులను ఏమీ అనలేదు, సీజరును చంపిన కత్తులతోనే తననూ చంపెయ్యమన్నాడు.

"మా చేతులనూ, కత్తులనూ చూసి మేము కిరాతకుల మనుకోకు. రోముకోసం కుమిలిపోయే మా హృదయాలలోకి చూడు. ప్రజలు సీజరు హత్యకు భీతావహులై ఉన్నారు. భయపడ నవసరం లేదని వారిని హెచ్చరించిన అనంతరం నేను సీజరును ప్రేమించినవాణ్ణి అయిఉండిన్నీ సీజరును ఎందుకు చంపానో సవిస్తరంగా చెబుతాను!" అన్నాడు బ్రూటస్.

సీజరు మరణం సందర్భంలో అంటోనీ ప్రసంగించటానికీ, సీజరు శవానికి యథోచితమైన దహనసంస్కారం జరిపించటానికీ కూడా బ్రూటసు అనుమతి ఇచ్చాడు; అయితే తన తరవాతనే అంటోనీ మాట్లాడవలసి ఉంటుందని షరతు పెట్టాడు.

బ్రూటస్ ప్రజల ఎదటికి వెళ్ళాడు. "మాకు సంజాయిషీ కావాలి," అని వారు కేకలు పెడుతున్నారు. బ్రూటస్ వారితో, "మీరు సీజరును ఎంతగా ప్రేమించారో నేనూ అంతగా ప్రేమించాను. కాని సీజరు బతికిఉంటే మీరంతా బానిస చావులు చచ్చి ఉండేవారు. మీకది ఇష్టమా? లేక సీజరు



చనిపోయి మీరు స్వేచ్ఛాజీవులుగా బతకటం ఇష్టమా ? మీలో ఎవరైనా బానిసలుగా చావ గోరిఉంటే వారిదృష్టిలో నేను ద్రోహినే! నేనే సీజరునయితే నాకు మీరంతా ఏమిచేసి ఉండేవారో నేను సీజరుకు అదే చేశాను. సీజరులోని గొప్పగుణాలను అందరమూ గౌరవిస్తాము. ఆయన దురాశే ఆయనకు చావు తెచ్చిపెట్టింది. నా చావు ఏనాడు రోముకు లాభం కలిగించినా, సీజరును చంపిన కత్తితో నేను ఆత్మహత్య చేసుకోవ టానికి సిద్ధంగా ఉంటాను!" అన్నాడు.

ఈమాటలతో ప్రజలు బ్రూటస్ పక్ష మయారు. బ్రూటస్ వేదికనుంచి దిగి వెళ్ళి పోతూ, "మీరెవరూ వెళ్ళిపోకండి. ఇప్పుడు మార్క్ ఆంటోనీ మాట్లాడతాడు. ఆయన సీజరు గురించి ప్రసంగిస్తాడు. అందరూ శ్రద్ధగా వినాలని నా కోరిక!" అన్నాడు.

ఆంటోనీ అసాధారణ వక్తృత్వశక్తి గల వాడు. అతను ప్రజలను ఎంత సులువుగా రెచ్చగొట్టగలడో బ్రూటస్ ఊహించలేదు. ఆంటోనీ సీజరును పొగడను అంటూనే పొగడేశాడు. సీజరును చంపిన కుట్రదారు లను పదేపదే పెద్దమనుషులంటూ ఆ మాట మీదా, కుట్రదారులపైనా అసహ్యం పుట్టిం చాడు. "సీజరు దురాశాపరుడని బ్రూటస్ చెబుతున్నాడు. బ్రూటస్ పెద్దమనిషి. నేను



మూడుసార్లు కిరీటం ఇవ్వబోతే మూడు సార్లూ సీజరు దానిని నిరాకరించాడు. దురాశాపరు డిలాగే చేస్తాడా? .... ఎంతటి సీజరు ఏ దశకు వచ్చాడో చూడండి. బతికి ఉన్న బ్రూటస్, కాసియస్‌లాటి పెద్దమనుషులకు అన్యాయం ఎందుకు చేయాలి. చచ్చిపోయిన సీజరుకే అన్యాయం చేద్దాం, మనకు మనమే అన్యాయం చేసుకుందాం!"- ఈ ధోరణిలో మార్క్ అంటోనీ ప్రసంగించి ప్రజలను రెచ్చగొట్టాడు. వారిని శవంచుట్టూ కూడమని చెప్పి సీజరు శవంలో గాయాలు చూపుతూ, ఏ గాయం ఎవరు చేశారో వివరించాడు. అంతా అయినాక అంటోనీ, "ఇదిగో సీజరు మరణశాసనం. ఇది చూస్తే మీరు ఏడుస్తారు. ఇందులో సీజరు తన అనంతరం ప్రతి రోమను పౌరుడికీ 75 నాణాలు వచ్చేటట్టుగా రాశాడు!" అన్నాడు.

ప్రజలలో ఆగ్రహావేశం పెరిగిపోయింది. వారు కుట్రదారులను వెతుక్కుంటూ నగరంపైన పడ్డారు. వారి కొంపలకు చిచ్చు పెట్టారు. అయితే కుట్రదారులు అపద పసికట్టి పారిపోయారు.

తరవాత కొంతకాలానికి సీజరు పక్షం వారికీ, కుట్రదారుల పక్షానికీ యుద్ధం జరిగింది. సీజరు పక్షానికి నాయకులు అంటోనీ, ఆక్టేవియస్ సీజర్, లెపిడస్ అనే ముగ్గురూనూ. రెండవ పక్షానికి బ్రూటస్, కాసియస్‌లు నాయకులు. అయితే ఈ ఇద్దరి మధ్యా నిజమైన స్నేహభావం లేదు. కాసియస్ నిజాయితీ లేనివాడనీ, స్వార్థపరుడనీ బ్రూటస్‌కు తెలిసింది. బ్రూటస్ యుద్ధ ఖర్చులకు డబ్బు కావాలని అడిగినప్పుడు కాసియస్ తనవద్ద బోలెడంత బంగారం ఉంచుకునికూడా లేదని కబురుచేశాడు.

ఫిలిప్పీ అనేచోట ఉభయపక్షాలకూ యుద్ధం జరిగి కుట్రదారులు ఓడిపోయారు. బ్రూటస్, కాసియస్‌లు శత్రువులచేత పడక ముందే ఆత్మహత్యలు చేసుకున్నారు.



# 7. సెంట్రల్ లెదర్ రిసెర్చ్ ఇన్స్టిట్యూట్ - మద్రాసు

మన దేశంలో ఏటా తయారయినన్ని ముడి చర్మాలూ, తోళ్ళూ ప్రపంచంలో ఇంకెక్కడా తయారుకావటం లేదు. ఇక్కడ ఏడాదికి 142 లక్షల ఆవుతోళ్ళూ, 50 లక్షల గేదెతోళ్ళూ, 213 లక్షల మేకతోళ్ళూ, 156 లక్షల గొర్రెతోళ్ళూ తయారవుతున్నాయి. వాటి విలవ సుమారు 40 కోట్ల రూపాయలు. వీటన్నిటినీ మన దేశంలోనే పదును చేసినట్టయితే వాటి ధర 80 కోట్ల రూపాయలుండవచ్చు.

ఈనాడు మనం 30 లేక 35 కోట్ల రూపాయల విలవ గల తోళ్ళు ఎగుమతి చేస్తున్నాం. మన దేశంలో తోళ్ల పరిశ్రమ చాలా వెనకపడి ఉండటంచేత మనం ఎక్కువగా లాభం పొంద లేకపోతున్నాం. అందుకే తోలుతో తయారుచేసిన వస్తువులూ, తోళ్ల పరిశ్రమకు కావలిసిన రసాయనాలు వగైరా దిగుమతి చేసుకుంటున్నాం.

మన దేశంలోనే తోళ్ల పరిశ్రమలో పరిశోధనలు జరిపి, దేశంలో లభ్యమయే ముడి రసాయనాలను ఆ పరిశ్రమలో వినియోగించటానికిగాను మద్రాసులో సెంట్రల్ లెదర్ రిసెర్చి ఇన్స్టిట్యూట్ నెలకొల్పబడి 1953 జనవరి 15 నుంచీ పనిచేస్తున్నది.






1. ఇల్లూరి రంగారావు, విజయవాడ

"చందమామ" పుట్టిన తేదీ తెలియజేస్తారా?

1947 జూన్ 25.

2. వి. సూర్యనారాయణ, భిలాయ్

"చందమామ" సంవత్సర చందా తగ్గించుటకు అవకాశములున్నవా?

ఇప్పుడుండే కాగితంధరలతో అది సాధ్యంకాదు.

3. ఏ. లక్ష్మీనారాయణ, ముదుగానపల్లి

"చందమామ" లో ఇటీవల ఇంద్రజాలములు ప్రచురించుటలేదు. కారణం?

ప్రొఫెసర్ సర్కార్‌గారికి తీరిక చిక్కి రాయటం ప్రారంభిస్తే తప్పక ప్రచురిస్తాం.

4. జె. వి. సుబ్రహ్మణ్యం, అద్దంకి

చందమామా! నీవలె దినదిన ప్రవర్ధమానముగా గడపదలచిన నా జీవితయాత్ర కష్టపరంపరలతో నున్నది. క్షేమముగా, సుకరముగా జీవితనౌక నడచుటెట్లు?

నౌక క్షేమంగా నడవాలంటే అనేక విషయాలు ఒనగూడాలి. మొదలు నౌక మంచిదై, అన్ని హంగులూ కలిగి ఉండాలి. దానికి సమర్థత గల సరంగూ, కళాసులూ ఉండాలి. ఆ తరవాత సముద్రంకూడా అల్లకల్లోలాలు లేకుండా ఉండాలి.

5. కోకా తిరుమలరావు, బెంగుళూరు

"మీకు తెలుసా?" శీర్షికలో వార్తలు యదార్థాలా? కల్పితాలా?

మాకు తెలిసినంతవరకు యదార్థాలే.

6. వేమవరపు చిరంజీవరావు, చల్లపల్లి

విక్రమార్కుడెవరు? ఆ శవం ఏమిటి?

బేతాళ కథలు కథాసరిత్సాగరంలో ఉన్నాయి. అవి కల్పితకథలే. కాని ధర్మసందేహాలతో కూడిన కథలను చెప్పటానికి ఎవరో ఈ మంచి పథకం కనిపెట్టారు. మొట్టమొదటి బేతాళ

కథ [సెప్టెంబరు 1955] చదివినట్టయితే బేతాళకథల పుట్టుక తెలుస్తుంది. కాని అది చదవని వారుకూడా ఏకథ కాకథ చదివి ఆనందించవచ్చు.

7. కోడూరు పుల్లారెడ్డి, అనంతపురం

ఇండియాలో వెలువడే హిందీ మాసపత్రికలలో ఎక్కువగ అమ్ముడు పోయేది హిందీ "చందమామ" నెల 1 కి 50,000 ప్రతులు అని చదివాను. ఇది ఎంతవరకు నిజం?

పూర్తిగా నిజం. ఇప్పుడు హిందీ "చందమామ" 62 వేలకు పైగా అమ్ముడవు తున్నది.

8. తిర్మలాచారి, మహమ్మదాబాద్

వజ్రములో నున్నది కేవలము బొగ్గు అని "మణిమాణిక్యాలు" లో రాశారు. సృష్టిలో అన్ని వస్తువులకన్న వజ్రమునకు గట్టితన మేల కలిగినది?

వజ్రం మనకు నేర్పే గుణపాఠం అదే. అంతస్స్వభావంబట్టి ఘనతా విలువా ఏర్పడ తాయిగాని, ద్రవ్యాన్నిబట్టి కాదు! మనుషులలోకూడా ఎన్నో వ్యత్యాసాలున్నాయి; అవి ద్రవ్యాన్నిబట్టి ఏర్పడినవికావు, అంతస్స్వభావాన్నిబట్టి ఏర్పడినవి.

9. దళవాయి ప్రసూన, తిరుమలై హిల్స్

లూనిక్ 2 చంద్రమండలం చేరడాన్ని గురించి అక్టోబరు 59 సంచికలో ప్రకటించలేదు. చందమామ కేమి సంభవించినా ఆ వివరాలన్నీ చందమామ రాయబారి "చందమామ" ద్వారా చందమామ సభ్యుల కింకనూ తెలియ కుండటం యోచించవలసిన విషయం.

లూనిక్ 2 చందమామను చేరేనరికి అక్టోబరు "చందమామ" అచ్చయిపోతున్నది. అందుచేత ఈ సంచికలో ఆ విషయం కొద్దిగా ప్రస్తావించాం.

10. వేలూరి శోభ, చిరివాడ

చందమామా! ప్రతినెల నేను చదివే సమయానికి నిన్ను మా అక్కయ్యలు, అన్నయ్యలు లాక్కుంటారు. నన్నేం చెయ్యమన్నావు?

ఇది చాలా అన్యాయం! మీరందరూ చందమామను ఉమ్మడి సొత్తుగా చూసుకోవటం నేర్చుకోవాలి.

11. సి. కాంత, ఆదోని

"కంచుకోట" ముగింపు ఎప్పుడండీ?

డిసెంబరు సంచికతో పూర్తి అవుతుంది.



# నక్క చేసిన మేలు

పూర్వం చీనాదేశంలోని ఒక ప్రాంతంలో అంటాక్ అనే నిరుపేద ఒకడుండేవాడు. అతనికున్న ఆస్తి ఒక్క దానిమ్మచెట్టు మాత్రమే. దానికి పోషణ చేసి కాపాడు కోవటంలోనే అతని కాలమంతా గడిచి పోయేది. ముఖ్యంగా దానిమ్మకాయలు పండే తరుణంలో అంటాక్ చెట్టుదగ్గిరే కూచుని అహోరాత్రాలు కాపలా కాసేవాడు.

అల్లరి పిల్లలెవరేనా తన దొడ్డిగోడమీదుగా తొంగి చూస్తేచాలు అంటాక్ అగ్గి అయిపోయి వాళ్ళను నానాతిట్లూ తిట్టి, చిక్కితే కొట్టను కూడా కొట్టేవాడు.

తన దానిమ్మచెట్టుమీద అతను చూపే అధికారం చూసి అతనికి "దానిమ్మరాజు" అని అందరూ పేరు పెట్టారు.

ఒక ఏడు దానిమ్మచెట్టుకు బాగా కాయలు కాశాయి. అవి పక్వానికి వచ్చే తరుణంలో అంటాక్ రాత్రింబగళ్ళు చెట్టుదగ్గిరే గడు పుతూ వచ్చాడు. ఒకరాత్రి ఎంత ఆపుకున్నా ఆగకుండా అతనికి నిద్ర వచ్చేసింది. తిరిగి మెలకువ వచ్చి చూసేసరికి చెట్టుమీద కొన్ని పళ్ళు లేవు.

అదేవిధంగా మరుసటి రాత్రి మరికొన్ని పళ్ళు మాయమయాయి.

మూడోనాడు దొంగను పట్టటానికిగాను అంటాక్ నిద్రపోతున్నట్టు నటించి, తన గోడ మీదుగా దూకి ఒక నక్క దానిమ్మచెట్టుకేసి రావటం చూశాడు. నక్క చెట్టుపైకి ఎగబాకే సమయంలో అంటాక్ వెళ్లి దాని తోకకాస్తా పట్టుకున్నాడు. కాని నక్క తప్పించుకు పోనేపోయింది.

ఆ తరవాతరోజు అంటాక్ నక్కను పట్ట టానికి ఒక యుక్తి పన్నాడు — అది గోడ మీదినుంచి దూకే చోట దట్టంగా బంక పోశాడు. నక్క అందులో దూకి కదలలేక



అతనికి చిక్కిపోయింది. అంటాక్ దానిని సమీపించి చేతులోవున్న దుడ్డుకర్రతో బాదబోయాడు.

"నన్ను వదిలిపెట్టావంటే నీకు మేలు చేస్తాను. కావాలంటే రాజు కూతురినే తెచ్చి పెళ్లిచేస్తాను!" అన్నది నక్క.

"నన్ను చూస్తే నీకూ వేళాకోళంగానే ఉందా? పుట్టుదరిద్రుడికి, రాజుగారు కాదు గదా, ఎవరూ పిల్లనివ్వరు!" అన్నాడు అంటాక్. కాని నక్క రాజకుమార్తెను తెచ్చి పెళ్లిచేసి తీరుతానని మరీమరీ చెప్పినమీదట అంటాక్ దానిని విడిచిపెట్టాడు.

నక్క నేరుగా ఏటి అవతల ఉండే రాజు గారి ఇంటికి వెళ్ళి రాజుతో, "మహారాజా, మీవద్ద రత్నాలు జల్లించే జల్లెడలున్నాయట! మా రాజుగారు ఒకసారి తెమ్మన్నారు. చాలా తట్టలతో రత్నాలు వచ్చాయి. వాటిని జల్లించి నలిరత్నాలు పారేసి మంచివి ఉంచుకుంటారు," అన్నది.

రాజు సరేనని నక్కకు రత్నాల జల్లెడ ఇప్పించాడు. నక్క దాన్ని తీసుకుపోయి, దాని కంతలో అక్కడక్కడా సన్నని పచ్చలూ, వైడూర్యాలూ, కెంపులూ ఇరికించి జల్లెడను తీసుకుపోయి రాజుగారి కిస్తూ యాదాలాపంగా దానిని నేలకేసి కొట్టింది.




రంగురంగుల రత్నపు నలుసులు కింద పడటం చూసి రాజకుమార్తెలు వాటిని ఏరుకోవటానికి ఎగబడ్డారు.

"రత్నాలు కావాలంటే చెప్పకపోయారా? మా అంటాక్‌రాజుగారి నడిగి నాలుగు ఒంటెలమీద పట్టించుకువచ్చి ఉందునే!" అన్నది నక్క.

ఈ అంటాక్‌రాజును తన అల్లుడుగా చేసుకోవాలని రాజుకు దురాశ పుట్టింది. ఆయన నక్కతో, "రత్నాలమాటకేం గాని, నువ్వు మధ్యవర్తిగా ఉండి మీ రాజుగారు మా ముగ్గురు అమ్మాయిలలో ఎవరినన్నా చేసుకునేటట్టు చేద్దూ!" అన్నాడు.



" తొందరపడకండి. ఆయన కసలు పెళ్లి ఆలోచన ఉన్నదీ లేనిదీకూడా నాకు తెలీదు. విచారించివచ్చి చెబుతాను!" అన్నది నక్క.

అది అంటాక్ వద్దకు తిరిగివచ్చి, " నీ పంట పండింది. రాజుగారు నీకు పిల్ల నిస్తారట. పెళ్ళికి బయలుదేరు!" అన్నది.

అంటాక్ దిగులుముఖం పెట్టి, " పెళ్ళికి పోవాలంటే ఎంత డబ్బు చేత పట్టుకోవాలి, ఎంత సన్నాహం చెయ్యాలి! నా దగ్గిర చిల్లి గవ్వ లేదే!" అన్నాడు.

" ఉపాయం ఉంటే అన్నీ చెయ్యవచ్చు. నువ్వు కట్టుబట్టలతో కదులు. మిగతాది నేను చూస్తాను!" అన్నది నక్క.

ఇద్దరూ బయలుదేరి ఏటివద్దకు వచ్చారు. అంటాక్‌ను మెడలోతు నీటిలో నిలిచి ఉండమని చెప్పి నక్క ఏరుదాటి, నేరుగా రాజు వద్దకు వెళ్లింది.

" మహారాజా, మా రాజుగారు నలభై ఒంటెలపైన నవరత్నాల రాసులు ఎక్కించి పెళ్లికి తరలి వస్తుండగా ఏరు పొంగి ఒంటెలన్నీ కొట్టుకుపోయాయి. పరివారమంతా ఏటి పాలయారు. మా రాజుగారి బట్టలన్నీ ప్రవాహంలో కొట్టుకుపోయాయి. ఏంచెయ్యాలో నాకు పాలుపోవటం లేదు!" అన్నది నక్క రాజుగారితో.

" పోయినదాని కేంచేస్తాం?" అంటూ రాజుగారు తన కాబోయే అల్లుడికి మంచి దుస్తులూ అవీ తీసుకుని, తన పరివారంతో ఏటివద్దకు వచ్చాడు.

అంటాక్ తన కాబోయే మామగారిచ్చిన రాజోచితమైన దుస్తులు ధరించి ఆయన వెంట వెళ్ళాడు.

అంటాక్‌కూ రాజుగారి మూడో కుమార్తెకూ వైభవంగా పెళ్ళి జరిగింది. విందులూ వినోదాలూ ముగిసినాక అంటాక్‌కు పెద్ద బెంగ పట్టుకున్నది. అతను నక్కతో, " ఇంత వరకు బాగానే జరిగింది. కాని నేను నా భార్యను కాపరానికి తీసుకుపోగానే నిజం

బయటపడిపోతుందే! ఏం జేతును!" అన్నాడు దిగులుగా.

"అప్పటి మాట అప్పుడు చూసుకుందాం!" అన్నది నక్క.

కొన్ని దినాలు గడిచాక రాజుగారు మంచి ముహూర్తం చూసి అల్లుడివెంట తన కుమార్తెను సిబ్బందితోసహా కాపరానికి పంపాడు. నక్క ముందుగా పరిగెత్తి వెళ్లింది. దారిలో దానికొక ఒంటెల బిడారు ఎదురైంది.

నక్క బిడారు యజమానితో, "బాబూ, బందిపోటు తరుముకువస్తున్నది! ఇవాళ నువు బయలుదేరిన వేళ మంచిదికాదు. నీ సొత్తంతా వాళ్లు దోచుకుపోతారు!" అన్నది.

బిడారు యజమాని నక్క వచ్చిన దిక్కుగా చూశాడు. గాలిలో దుమ్ము లేస్తూ ఉండటం అతనికి కనిపించింది. అతను కంగారుపడి, "ఏంచెయ్యను? నా ప్రాణం ఎట్లాగైనా కాపాడు!" అన్నాడు నక్కతో.

"వాళ్ళు వచ్చి ఈ బిడారు ఎవరిదని అడిగితే అంటాక్ మహారాజుదని చెప్పు. వాళ్లు నిన్నేమీ చేయక తమదారిన పోతారు!" అన్నది నక్క.

నక్క ముందుకు వెళ్లిపోయింది. కొద్ది సేపట్లో రాజుగారి సిబ్బంది అటుగా వచ్చింది. రాజకుమార్తె వెంట ఉన్నవాళ్ళు



బిడారు యజమానిని, "ఈ బిడారు ఎవరిది?" అని అడిగారు.

ఆ మనిషి, "అంటాక్ మహారాజుగారిది!" అన్నాడు. రాజకుమార్తె వెంట ఉన్నవాళ్ళు సంతోషించారు.

నక్క దారిలో కనిపించిన ఒక గుర్రాల మంద యజమానికీ, ఒక గొర్రెలమందను కాసేవాడికీకూడా ఇలాగే చెప్పింది. రాజకుమార్తె మనుషులు, "ఈ గుర్రాలమంద ఎవరిది?" "ఈ గొర్రెలమంద ఎవరిది?" అని అడిగితే ఆ మందలవెంట ఉన్న మనుషులు, "అంటాక్ మహారాజుగారిది!" అని జవాబు చెప్పారు.

చివరకు నక్క ఒక రాక్షసుడి కోటకేసి వెళ్లింది. రాక్షసరాజు నక్కను చూసి, "ఏమిటి, అట్లా వగర్చుతూ వస్తున్నావు?" అని అడిగాడు.

"ఇంకేముంది? కొంప మునిగింది! బంది పోటు వచ్చిపడుతున్నది. నేనేమిటి, అందరూ పారిపోతున్నారు. బతికుంటే బలుసాకు తినవచ్చు. లక్షల సంఖ్యలో ఉన్నారు. నువు వాళ్లను ఏంచెయ్యగలవు? ప్రాణం కాపాడుకో!" అన్నది నక్క.

రాక్షసరాజు కంగారుపడి, "ఎట్లా కాపాడుకోను? ఎక్కడికి పోను!" అన్నాడు.

"గాడిపొయ్యిలో పడుకో! మీద కట్టెలు కప్పేస్తాను! వాళ్ళు వెళ్ళాక పైకి వద్దువు గాని!" అన్నది నక్క.

రాక్షసరాజు గాడిపొయ్యిలో పడుకున్నాడు. వాడిపైన కట్టెలు పేర్చి నక్క వాటికి నిప్పు పెట్టింది. రాక్షసరాజు చచ్చిపోయాడు. నక్క పెళ్లివారి సిబ్బందికి ఎదురు వెళ్లి, దారిచూపి రాక్షసరాజు కోటకు వారిని తెచ్చింది.

ఆ కోట చూసి, అదే అంటాక్‌రాజు కోట అనుకుని పెళ్లికూతురూ, ఆమెవెంట వచ్చిన పరివారమూ చాలా సంతోషించారు.

అంటాక్ తన భార్యతోనూ, ఆమె వెంట వచ్చిన పరివారంతోనూ సుఖంగా జీవిస్తూ వచ్చాడు. నక్కకూడా వారివెంటనే ఉండేది.

ఒకనాడు నక్క అంటాక్ వద్దకు వచ్చి, "నేను నీకింత ఉపకారం చేశాను. నేను చచ్చిపోతే నన్నేంచేస్తావు?" అని అడిగింది.

"నెత్తిన పెట్టుకుంటాను!" అన్నాడు అంటాక్.

కొంతకాలానికి నక్క చచ్చిపోయింది. అంటాక్ మాట ఇచ్చిన ప్రకారం నక్క చర్మంతో టోపీ చేయించి దానిని నెత్తిన పెట్టుకున్నాడు. ఈ అచారం ఇప్పటికీ ఆ ప్రాంతంలో ఉన్నది. వాళ్లు నక్కచర్మాలతో చేసిన టోపీలు పెట్టుకుంటారు.






# అహింసాజ్యోతి

## [ 11 ]

వారం గడిచింది. భద్రీ, అనురుద్ధుడూ, శుద్ధోదనుడి మరొక తమ్ముడి కొడుకు ఆనందుడూ, కింబిలుడూ, సుప్రబుద్ధుడి కుమారుడు ( యశోధర అన్న ) దేవదత్తుడూ, భగుడూ అనే శాక్యరాజకుమారులు వినోదం నెపంమీద బయలుదేరి పదహారు మైళ్ళ దూరాన ఉండే ఒక చోటికి వెళ్ళారు. అక్కడ వారు తమ పరివారాన్ని ఉంచి, ఉపాలి అనే మంగలినిమాత్రం వెంటబెట్టుకుని మరొక చోటికి వెళ్లారు. అక్కడ వారు తమ అభరణాలన్నిటినీ తీసి ఉపాలికిచ్చి, తాము సన్యసించబోతున్నట్టు వాడితో చెప్పారు. ఇది వింటూనే ఉపాలి తనలో, "నేనీ అభరణాలన్నీ తీసుకుని కపిలవస్తుకు తిరిగి పోయానంటే శాక్యులు నన్ను ప్రాణాలతో వదలరు. ఈ అబ్బాయిలు అన్నిసుఖాలూ వదిలేసి సన్యాసం తీసుకుంటుంటే నేనుమాత్రం ఎందుకు సన్యసించరాదు?" అనుకున్నాడు. వాడు ఆ నగలన్నిటినీ ఒక చెట్టుకొమ్మకు తగిలించి వారి వెనకనే బయలుదేరాడు. వాడుకూడా తమతోబాటు సన్యాసం పుచ్చుకోవటానికి నిశ్చయించాడని తెలిశాక శాక్య రాజకుమారులు వాణ్ణికూడా తమవెంట తీసుకుపోయారు.

ఆ సమయానికి బుద్ధుడు అనుప్రియ అనే గ్రామంలో ఉంటున్నాడు. శాక్య రాజకుమా




రులు అయనవద్దకు వెళ్ళి, "మాకు అహంకారం ఉగ్గుబాలతో పెట్టినది. మా రాజసాన్ని చంపటానికి ఒక ఉపాయం ఉన్నది. ముందుగా ఈ మంగలికి సన్యాసం ఇప్పించినట్టయితే మేము వాడికి వందనం చెయ్యవలిసివస్తుంది. దానితో మా రాజసం చచ్చి ఊరుకుంటుంది. ఆ తరవాత మళ్ళీ మాలో రాజ్యలోభం తలఎత్తదు!" అన్నారు.

బుద్ధుడు దీనికి ఆమోదించి ముందుగా మంగలి ఉపాలికి సన్యాసం ఇప్పించి, తరవాత రాజకుమారులకు ఇచ్చాడు.

ఇది జరిగేనాటికి బుద్ధుడు యాభైఅయిదేళ్ళవాడు. అప్పటికాయన బుద్ధుడై ఇరవై సంవత్సరాలయింది. కాని ఆయనకు సపర్యలు చెయ్యటానికి నియమంగా ఒకరు ఉండటం జరగలేదు. తనవెంట ఎప్పుడూ ఒకేమనిషి ఉండటం సౌకర్యంగా ఉంటుందని ఆయన తన శిష్యులతో అన్నాడు. అనేకమంది అర్హతులు ముందుకు వచ్చారుగాని బుద్ధుడు అందుకు ఒప్పుకోలేదు.

ఆనందుడు బుద్ధుడికి సపర్యలు చేయటానికి ఒప్పుకున్నాడు. కాని అతను కొన్ని షరతులు పెట్టాడు. అవి ఏమిటంటే: బుద్ధుడు విడిచిన వస్త్రాలు తనను ధరించమనరాదు; బుద్ధుడి భిక్షాపాత్రలోని ఆహారాన్ని తనను తినమనరాదు; అయనను ఎవరైనా భిక్షకు పిలిస్తే తాను వెళ్ళవలసి రాగూడదు; తాను భిక్షఎత్తిన ఆహారాన్ని బుద్ధుడు భుజించాలి; ఎవరైనా బుద్ధుడితో మాట్లాడవలిసివస్తే తనద్వారా మాట్లాడాలి; తనకు ఎప్పుడు ఏవిషయంలో ఏసందేహం వచ్చినా బుద్ధుడు వెంటనే ఆ సందేహాన్ని తీర్చాలి; తను లేని సమయంలో బుద్ధుడు ఏదైనా ప్రసంగం చేస్తే, తాను వచ్చినాక అయన ఆ ప్రసంగమంతా తనకోసం మళ్ళీచెయ్యాలి.

ఈ నియమాలన్నిటికీ బుద్ధుడు ఒప్పుకున్నాడు. అది మొదలు ఆనందుడు బుద్ధుడి పరిచారకుడయాడు. ఆనందుడు బుద్ధుడికి



చేసిన సేవ ఆదర్శప్రాయమైనది. బుద్ధుడు ఆనందుణ్ణి ఎప్పుడు పిలిచినా అతను హాజరులో ఉండేవాడట. ఎన్నడూ బుద్ధుడు ఆనందుడి కోసం రెండవసారి పిలవవలసి రాలేదని చెబుతారు.

* * *

ఒక సందర్భంలో బుద్ధుడు ధర్మబోధ చేస్తూ, వినాశనం ప్రతిదానికీ వచ్చి తీరుతుందని చెప్పటానికి దృష్టాంతంగా, అత్యున్నత దశలో విశాలానగరంకూడా ఒకనాడు పీడలకూ, క్షామానికీ, పిశాచాలకూ ఎర అవుతుందని అన్నాడు. ఆయన అమోఘ వచనం అక్షరాలా నిజమయింది. మొదట నగరమంతటా అంటువ్యాధులు చెలరేగాయి, వాటి వెనకనే క్షామం ఏర్పడింది. నగరం పీనుగుపెంటల మయమయింది. చచ్చినవారికి దహనం చేసేవారుకూడా లేకపోయారు.

ప్రజలు వెళ్ళి తమ రాజుగారితో మొరపెట్టుకున్నారు. "మీకి కష్టాలు సంభవించటంలో నావల్ల దోషం ఏమైనా ఉన్నదా ?" అని రాజు అడిగాడు. అలాటి దేమీ లేదన్నారు ప్రజలు. అయితే ఏంచెయ్యాలన్నాడు రాజు. మహర్షుల సహాయంతో ఈ బాధలన్నీ నివారణ అవుతాయని కొందరన్నారు. మరి కొందరు బుద్ధుడి శరణు జొచ్చినట్టయితే



అన్ని కష్టాలూ గట్టెక్కుతాయన్నారు. ఈ సలహాప్రకారం బుద్ధుణ్ణి విశాలానగరానికి ఆహ్వానించటానికై కొందరు రాజకుమారులు బయలుదేరి వెళ్లారు. ఆ సమయాన బుద్ధుడు వేలువన విహారంలో ఉంటున్నాడు. అందుచేత రాజకుమారులు బింబిసార మహారాజును కలుసుకుని ఆయనకు తాము వచ్చిన పని చెప్పారు.

"బుద్ధుడికి ఎక్కువ తక్కువలు లేవు. ఆయన అందరిపట్లా సమానమైన దయగలవాడు. మీరు స్వయంగా వెళ్లి ఆయనతో మీ కోరిక చెప్పుకోండి!" అని బింబిసారుడు వారికి సలహా ఇచ్చాడు. రాజకుమారులు

బుద్ధుడివద్దకు వెళ్లి ఆయనను తమ విశాలా నగరానికి ఆహ్వానించారు. బుద్ధుడు వెంటనే సమ్మతించాడు.

ఈ సంగతి తనకు తెలియగానే బింబిసార మహారాజు బుద్ధుడికోసం రాజగృహం నుంచి గంగానది ఒడ్డువరకూ 80 మైళ్ళ పొడవున దారి వేయించాడు. అదే సమయంలో విశాలానగరవాసులైన లిచ్ఛవులు గంగ అవతలి ఒడ్డునుంచి తమ నగరానికి 48 మైళ్ళ పొడవున దారి వేశారు.

అంతకు మునుపు ఎంతో కాలంగా లేని వాన బుద్ధుడు ప్రయాణం కాగానే కురవసాగింది. గంగాతీరందాకా బింబిసార మహారాజు బుద్ధుడివెంట వెళ్లి అక్కడఆగిపోయి, బుద్ధుడి రాకకు ఎదురుచూడ సాగాడు. బుద్ధుడు నది దాటి విశాలానగరానికి వెళ్లాడు.

ఆయన నగరం ప్రవేశిస్తూనే ఆనందుడితో, "నీవు భిక్షాపాత్రనిండా నీరు పోసుకుని నగరమంతటా చల్లి రా!" అన్నాడు. ఆనందుడు అలాగే చేశాడు. దీని ఫలితంగా రోగులు ఆరోగ్యవంతులయారు. అనేక మంది పౌరులు ఆనందుడి వెంటపడి తిరుగుతూ బుద్ధుడి మహిమను ప్రశంసించారు.

బుద్ధుడు రాజభవనానికి వెళ్ళి అక్కడ చేరినవారికి రతన సూత్రం ఉపదేశించాడు. అశేషమైన జనం ఆయనకు శిష్యులైపో



యారు. ఆయన విశాలానగరంలో కొన్ని దినాలుండి తిరుగుప్రయాణమై వచ్చేటప్పుడు నాగులు కొంద రాయనను తమ ఇంటికి ఆహ్వానించారు. ఆయన వారి ఇంట ఒక రాత్రి ఉండి, మర్నాడు గంగ దాటి, బింబిసార మహారాజును కలుసుకుని రాజగృహానికి తిరిగి వచ్చేశాడు.

విశాలానగరంలో అంబపాలి అనే ప్రసిద్ధ రాజనర్తకి ఉన్నదనీ, ఆమె మూలాన విశాలానగరపు ఖ్యాతి దేశదేశాలా విస్తరించిందనీ బింబిసార మహారాజుకు తెలియవచ్చింది. తన రాజధాని అయిన రాజగృహంలో రాజనర్తకి లేకపోవటంచేతనే ఆ నగరానికి విశాలానగరానికున్న ఖ్యాతి లేకపోయిందని విచారం కలిగి బింబిసారుడు తానుకూడా లిచ్ఛవులలాగే ఒక గొప్ప అందగత్తెను రాజనర్తకిగా నియమించుదామనుకున్నాడు.

తన నగరంలోనూ, పరిసరాలలోనూ ఉండే అందగత్తెలయిన రాజకుమార్తెలందరూ రావాలని ఆయన ఒక ప్రకటన చేశాడు. అలా వచ్చినవారందరిలోకీ సాలావతి అనే రాజకుమార్తె అందరికన్నా చక్కనిదిగా ఎన్నుకోబడింది. బింబిసార మహారాజు ఆమెను రాజనర్తకిని చేసి ఆమె నిమిత్తమై తన రాజ్యంపైన 2 లక్షల మసురజాలు సుంకం విధించాడు. ఆ మొత్తానికి





కైనా తెలియనివ్వక, తన ఆరోగ్యం బాగు లేదని సాకుపెట్టి, ఇల్లు కదలకుండా ఉండి పోయింది. నెలలు నిండాక ఆమెకొక మగ శిశువు కలిగాడు. ఆ శిశువును ఆచార ప్రకారం అడవులలో వదిలిరమ్మని తన నౌకర్లతో చెప్పి, సాలావతి స్నానంచేసి మామూలుగా అందరి ఎదటికీ రాసాగింది.

ఏ పాపమూ ఎరగని ఆ పసికందును నౌకర్లు నట్టడవిలో ఒక గోతిలో పడేసి వెళ్ళి పోయారు. ఆరోజునే బింబిసారుడి కొడుకైన అభయుడు ఆ అరణ్యంలోకి తన పరివారంతో సహా విహరించబోయాడు. ఒకచోట చాలా కాకులు వలయంగా కూచుని ఉండటం అభయుడికి కనిపించింది. ఆ కాకులు ఏదో ఆహారంచుట్టూ కూచున్నా యనుకుని అభయుడు అదేమిటో చూసి రావటానికి తన నౌకర్లను పంపాడు. వారు చూసివచ్చి ఒక గోతిలో ఒక మగశిశువున్న దనీ, అది ఇంకా ప్రాణాలతో ఉన్నదనీ, కాకులు దానిని పొడవక రక్షించేవాటిలాగ చుట్టూ చేరాయనీ చెప్పారు.

అనాథ శిశువన్న దయవల్లనో, తానే తండ్రి అయిన కారణంగా తనలో కలిగిన సహజ వాత్సల్యంచేతనోగాని అభయుడికి ఆ శిశువుపై అనురాగం కలిగింది. అతను

తాను మరొక లక్ష మసురణాలు జతచేర్చి సాలావతికి కానుకగా ఇచ్చాడు. ఆమె మూలాన రాజగృహానికికూడా కీర్తి వచ్చింది.

రాజుగారి కుమారుడైన అభయుడనే వాడు ఈ రాజనర్తకిని ప్రేమించాడు. కొంత కాలానికి సాలావతి గర్భవతి అయింది. రాజ నర్తకులు తాము గర్భవతులుగా ఉన్నట్టు ఎవరికీ తెలియనివ్వరు. తాము కనే బిడ్డ ఆడ శిశువైతే రహస్యంగా సాకి పెద్దదాన్ని చేస్తారు; మగపిల్లవాడు పుట్టినట్టయితే అడ వులపాలు చేసేస్తారు.

ఈ సంప్రదాయాన్ని అనుసరించి సాలా వతి తన గర్భంగురించి కనీసం అభయుడి

ఆ శిశువుకు జీవకుడు (ప్రాణాలతో ఉన్న వాడు) అని పేరుపెట్టి, తన ఇంటికి తీసుకుపోయి, దాదులను ఏర్పాటుచేసి ఆ శిశువును పెంచసాగాడు.

జీవకుడు పెరిగి ఎనిమిదేళ్ళవాడయాడు. ఒకనాడు వాడు ఇతర రాజకుమారులతో కలిసి ఆడుకుంటుండగా వారు, "ఓరీ, నీకు అమ్మ లేదు," అన్నారు. జీవకుడీ మాటకు సిగ్గుపడి అభయుడివద్దకు వెళ్లి, "నాన్నా, నాకు అమ్మ ఎవరు?" అని అడిగాడు.

"నాన్నా, నేను నీ తండ్రిని. కాని నీ తల్లి ఎవరో నేనెరుగను. నిన్ను ఎవరో కని అడవిలో పారేస్తే నాకు దొరికావు," అన్నాడు అభయుడు.

ఈ మాటలు వినేసరికి జీవకుడికి ఒక్క విషయం బోధపడింది: తాను తన తండ్రి ఆస్తికి వారసుడు కాడు, తాను ఏదైనా ఒక వృత్తివిద్య నేర్చుకుని దాని సహాయంతో పొట్ట పోసుకోవాలి. పద్దెనిమిది శాస్త్రాలున్నాయి, అరవైనాలుగు కళలున్నాయి. వీటిలో తాను ఏది అభ్యసించాలా అని దీర్ఘంగా యోచించి జీవకుడు చివరకు వైద్యవిద్య నేర్చుకుందామని నిశ్చయించాడు. ఆ వృత్తిలో తనకు గౌరవమూ, పేరు ప్రతిష్ఠలూ వస్తాయని వాడికి తోచింది.

ఈ నిశ్చయంతో జీవకుడు తక్షశిలకు వెళ్లి, ఒక గురువును చేరి తనకు వైద్యవిద్య చెప్పమని కోరాడు. "నీ కుల గోత్రాలేమిటి?" అని గురువు అడిగాడు. నిజం చెప్పెయ్యటానికి బిడియపడి జీవకుడు, "నేను బింబిసార మహారాజు మనవణ్ణి, అభయుడి కుమారుణ్ణి!" అన్నాడు.

"అయితే నాకు గురుదక్షిణ కింద ఏమి ఇచ్చుకోగలవు?" అని గురువు మళ్ళీ అడిగాడు.

"స్వామీ, నేను మావాళ్ళకు చెప్పకుండా పారిపోయి వచ్చాను. అందుచేత వెంట ఏమీ తెచ్చుకోలేదు. నన్ను కనికరించి మీ



శిష్యుడుగా చేర్చుకున్నట్టయితే మీకు సేవ చేసి రుణం తీర్చుకుంటాను!" అన్నాడు జీవకుడు.

ఈ గురువు తన శిష్యులవద్ద సాధారణంగా వెయ్యి సువర్ణాలు గురుదక్షిణ పుచ్చుకుంటాడు. అయినప్పటికీ ఆయనకు జీవకుణ్ణి చూస్తే వాడు విద్యాదానం చేయదగినవాడని అనిపించింది. అందుచేత ఆయన అతన్ని తన శిష్యుడుగా చేసుకుని వైద్యవిద్య చెప్పనారంభించాడు. ఇంకొకరయితే పదహారేళ్ళలోకూడా తెలుసుకోలేని వైద్య రహస్యాలన్నిటినీ జీవకుడు ఏడు సంవత్సరాల కాలంలో నేర్చుకున్నాడు.

ఒకనాడు జీవకుడు తన గురువుతో, "స్వామీ, నేనీ విద్య మీదగ్గిర ఇంకా ఎంత కాలం నేర్చుకోవాలి?" అని అడిగాడు.

గురువు అతనితో, "నీవు నాలుగురోజులు సెలవు తీసుకుని నగరద్వారం వెలపల పదహారుమైళ్ళ దూరంలో ఉండే స్థలమంతా శ్రద్ధగా పరీక్షించు. అక్కడ నీకు కనిపించే చెట్లచేమలలో వైద్యానికి పనికిరానివిగా కనబడిన వేళ్ళనూ, పువ్వులనూ, బెరడునూ, కాయలనూ పట్టుకురా. ఆ తరవాత, నీ చదువు ఎప్పుడు పూర్తి అవుతుందో నేను చెబుతాను," అన్నాడు.

జీవకుడు అలాగే నాలుగురోజులపాటు తిరిగి చివరకు ఉత్త చేతులతో గురువు వద్దకు వచ్చి, "స్వామీ, వైద్యానికి పనికిరాని ఒక్క వేరుగాని, పువ్వుగాని, బెరడుగాని, కాయగాని నాకు ఎంత వెతికినా కనిపించలేదు," అన్నాడు.

"నాయనా, నీ చదువు ముగిసింది. నీకింక చెప్పగల గురువు ఎవడూ లేడు!" అన్నాడు గురువు జీవకుడితో.

తరవాత ఆయన జీవకుడికి మూడు నాలుగు రోజులకు సరిపోయే గ్రాసం ఇచ్చి, వెంట మనుషులను పంపి అతణ్ణి ఇంటిదాకా సాగనంపించాడు. —(ఇంకా ఉంది)



# మీకు తెలుసా?

పురాతన జంతువులలో "ఇఖ్తియోజార్" అనే చేపబల్లి ఉండేదని మీరు లోగడ (డిసెంబరు 55 లో) తెలుసుకున్నారు. ఇటీవల ఇంగ్లండులోని నార్ఫోక్‌లో స్ట్రోబ్రిజ్ అనే చోట 13 కోట్ల సంవత్సరాలక్రితం జీవించిన దయ్యపు చేపబల్లి "ఇఖ్తియోజార్" తల ఎముక దొరికింది. దీని నిడివి దాదాపు 4 అడుగులున్నదట!

* * *

భూమి పైపొరలో ఉండే మూలపదార్థాలలో ప్రాణవాయువు ( బరువునుబట్టి ) సగానికి కొంచెం తక్కువగానూ, సిలికాన్ కాలువంతుకు కొంచెం ఎక్కువగానూ ఉన్నాయి. మిగిలిన కాలువంతులో అల్యూమినం, ఇనుము, కాల్షియం, సోడియం, పొటాసియం, మెగ్నీషియం మొదలైనవన్నీ ఉన్నాయి. మొత్తంలో నూరింట ఒక వంతు హైడ్రోజన్; రాగి, జింకూ, సీసమూ, నికెల్, గంధకం, భాస్వరం, పాదరసం, వెండి, బంగారం మొదలైనవన్నీ కలిపితే నూరింట రెండు వంతులు.

టైటానియం, జిర్కోనియం, వెనాడియం మొదలైన లోహాలను అరుదు లోహాలుగా భావిస్తాం. నిజానికి భూమిపొరలో ఇవి ఉన్నంత విరివిగా బంగారం, పాదరసం మొదలైనవి లేవు. అయితే ఇవి అరుదు లోహాలుగా భావించటానికి కారణమేమంటే ఇవి కొన్ని ప్రాంతాలలో పెద్దమొత్తాలలో దొరకక అంతటా వ్యాపించి ఉన్నాయి.

అదీకాక అరుదు లోహాలన్నది స్థిరమైన నిర్వచనం కాదు. ఈనాడు విరివి లోహాలుగా గణించబడే మెగ్నీషియంలాటివి ఒకప్పుడు అరుదు లోహాలుగా పరిగణించబడేవి. మనం ఉత్పత్తి చేయ నారంభించినాక అరుదు లోహాలే విరివిలోహాలవుతాయి.

* * *

రోజుకు ఎన్నిగంటలని అడిగితే మీరు ఏంచెబుతారు? 24 గంటలని చెబుతారు. కాని ఇది నిజంకాదు. సంవత్సరంలో కొన్నిరోజులు 24 గంటలకంటె అనేక నిమిషాలు తక్కువ ఉంటాయి, మరికొన్ని రోజులు అనేక నిమిషాలు ఎక్కువ ఉంటాయి. మీవద్ద సరిగా నడిచే గడియారం ఉన్నట్టయితే అది సంవత్సరంలో నాలుగుసార్లు మాత్రమే మిట్టమధ్యాన్నానికి 12 గంటలు చూపుతుంది.

* * *

సూర్యుడికి సమీపంలో ఉండే నక్షత్రాలలో ఒకటి "సిరియస్". దీనినుంచి మనకు కాంతి రావటానికి 8 సంవత్సరాల 10 మాసాలు పడుతుంది. దీనిచుట్టూ ఒక గ్రహం తిరుగుతున్నది; ఇది "సిరియస్" చుట్టూ తిరిగి రావటానికి 49 సంవత్సరాలు పడుతుంది. దీని పరిమాణం మన సూర్యుడిలో సుమారు 7 వేల వ వంతుమాత్రమే, కాని దాని బరువు సూర్యుడి బరువులో ముక్కాలువంతుకు పైగా ఉంటుంది. దీనినిబట్టి ఈ గ్రహంలో ఉండే ద్రవ్యం భూమిమీది నీటికంటె 60,000 రెట్లు ఎక్కువ బరువు ఉంటుందని శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. ఇక్కడి మట్టి ఒక లోటాడు తీసుకుంటే అది 12 టన్నుల బరువుంటుంది!



# అంటార్క్టికా మీదుగా ప్రయాణం



## 2

మరి తొమ్మిదిరోజుల అవతల — నవంబరు 24 న—అసలు ప్రయాణం ఆరంభమయింది. ఈ ప్రయాణానికి 3 "మంచు పిల్లులూ", 2 'వీజెల్‌లూ', ఒక 'మస్కెగ్' అనే ట్రాక్టరు వాహనాలు ఉపయోగించబడ్డాయి. ఈ వాహనాల గమ్యస్థానం సౌత్ ఐస్. ఇది 300 మైళ్ల దూరాన, సముద్ర మట్టానికి 4,430 అడుగుల ఎత్తున, అంటార్క్టికాను కప్పిన మంచు పొర పైభాగాన ఉన్నది.

ప్రయాణం 30 మైళ్లు సాగకముసుపే ఫూక్స్ ఎక్కిఉన్న "మంచుపిల్లి" కింద ఒక మంచువంతెన విరిగి, వాహనంముందు చక్రం ఒకటి కింద ఉండే అగాధంలోకి ఇరుక్కుపోయింది. ఎలాగైతేనేం, అందరూ కలిసి దాన్ని ఆ ప్రమాదంనుంచి బయటికి లాగారు.

సౌత్‌ఐస్‌కు వెళ్లేదారిలో ఫిల్చ్‌నర్ మంచు పలక అంచున ప్రమాదకరమైన ప్రదేశం ఉన్నది. 11 మైళ్ల మేర దారికి అడ్డంగా లోతైన కందకాలున్నాయి, వాటిపైన మంచు కప్పి ఉంటుంది. ఈ ప్రమాద ప్రాంతాన్ని సూచించటానికి అదివరకే జెండాలు పాతి ఉంచారు. డిసెంబరు 3 నాటికి వాహనాలు ఈ ప్రాంతం చేరవచ్చాయి. ఈ ప్రాంతంలో ఒక "మంచు పిల్లి", ఒక "వీజెల్" కందకాలలో దిగబడిపోవటం జరిగింది. ఈ రెండు దుర్ఘటనలూ జరిగిననాడే ప్రయాణీకులలో ఒకడు, హఠాత్తుగా కాళ్లకింద మంచు విరిగి, 80 అడుగుల లోతు కందకంలో పడిపోయినంత పని చేశాడు.

వారు 29 రోజులు ప్రయాణంచేసి, 349 మైళ్లు గడిచి డిసెంబరు 21 న సౌత్‌ఐస్

చేరుకున్నారు. ఇక్కడ కుక్కలూ, కొందరు మనుషులూ అదివరకే ఉన్నారు. డిసెంబరు 23 న కుక్కలూ, వైర్‌లెస్ తీసుకుని, 20 రోజులకు సరిపోయే ఆహారంతో కొందరు మనుషులూ దారివెతుకుతూ ముందు బయలుదేరారు.

ఇప్పుడు ప్రయాణం వెంట 8 వాహనాలూ, చక్రాలు లేని లాగుడు బళ్లు 12 పెద్దవీ, అనేకం చిన్నవీ ఉన్నాయి. వెంట తీసుకుపోవటానికి బోలెడన్ని నూనె డబ్బాలూ, ఇతర టిన్నులూ, పెట్టెలూ, ఇతర సామగ్రీ ఉన్నది. ఒక్క పెట్రోలే 21 టన్నులున్నది. ల్యూబ్రికేటింగు నూనెలూ, మరమ్మతు పరికరాలూ, "స్పేర్" భాగాలూ ఒక అరటన్ను. ఇవిగాక ఒకటిన్నర టన్నుల ఆహారమూ, మంచు పొర మందం కొలవటానికిగాను పేలుడు మందు అరటన్నూ, అరటన్ను కిరసనాయిలూ (వంట వగైరాలకు), శాస్త్ర పరికరాలూ, డేరాలూ, మోకులూ, మంచు మీద నడవటానికి "స్కీ"లూ, మంచు గొడ్డళ్లూ, మూడు నాలుగు మాసాలపాటు అందరికీ అవసరమయే ఇతర వస్తువులూ—అంతా కలిపి 30 టన్నుల సామగ్రి ఉన్నది. ఇంత పెద్ద సామగ్రితో క్రిస్మస్ పండగ (డిసెంబరు




25) నాడు ఫూక్స్ ప్రభృతులు సౌత్‌ఐస్ నుంచి దక్షిణ ధ్రువంకేసి బయలుదేరారు. అక్కడికి ధ్రువం 555 మైళ్ల దూరాన ఉన్నది.

ఈలోపుగా కుక్కలనూ, చక్రాలు లేని స్లెడ్లనూ తీసుకుని ముందు వెళ్లినవారు దారి నిర్ణయించటమే గాక, 10 మైళ్లకొక మంచు కట్టడాన్ని గుర్తుగా నిర్మించుతూ వెళ్లారు.

ఇప్పుడు వీరు వెళ్లేదారిలో కందకాలు లేవు గాని గతుకులు జాస్తి. ఇక్కడ గాలి తూర్పు కేసి వీస్తూ ఉంటుంది. అది మంచులో తూర్పు పడమరలుగా గాట్లు పెడుతుంది. చలికి బిగుసుకుపోయిన ఈ గాట్ల

మీదుగా దక్షిణాభిముఖమై వెళ్లే వాహనాలు నడపటం అమిత కష్టం. గతుకులమూలాన వాహనాలకు కుదుపు జాస్తి, నడక సాగదు.

మధ్యమధ్యను భూమ్యాకాశాలు కాంతితో నిండిపోయి, ఏది భూమో ఏది ఆకాశమో తెలియరాదు, కొద్దిదూరంలో ఉండే వివరాలుకూడా కనిపించవు. ఇలాటి పరిస్థితులలో ప్రయాణంచేస్తూ, మధ్యమధ్య వాహనాలు మరమ్మతులు చేసుకుంటూ, మూడు గంటల కొకసారి పేలుడుమందు సహాయంతో తమకింద ఉండే మంచు మందాన్ని ప్రతిధ్వనులద్వారా కొలుస్తూ, మధ్యమధ్య మజిలీలు వేస్తూ, రోజుకు కొద్ది గంటలు మాత్రమే విశ్రమించుతూ వీరు ముందుకు సాగారు. ఇప్పుడు వీరు ప్రయాణం చేస్తున్నది, దక్షిణధ్రువపు మంచు పీఠ భూమిమీద.

వీరికి ముందుగా కుక్కలతో దారి అన్వేషిస్తూ వెళ్లినవారు జనవరి 5 న "గతుకుల దారి" అంతమయినట్లు తెలుసుకుని వెనక వచ్చేవారికోసం ఆగిపోయారు. మర్నాటి నుంచీ అందరూ కలిసే ప్రయాణం సాగించారు. ఇన్నాళ్లకు వాహనాలు పై'గియర్'లో పరిగెత్తే అవకాశం వచ్చింది. కాని కుక్కల మూలాన వారు ఏనాడూ 30 మైళ్లకంటె జాస్తిగా ప్రయాణించలేదు. అంతకన్న



ఎక్కువ దూరం నడిస్తే కుక్కలు నీర సించిపోతాయి.

ఈ ప్రయాణంలో వీరు కనిపెట్టిన వింత విషయమేమంటే మంచు అడుగునఉండే రాతిభూమి ఎత్తు సముద్రతీరానకన్న ధ్రువానికి దగ్గిరిగా చాలా తక్కువ. అంటే అంటార్క్‌టికా ఖండం శిబ్బిలాగా, మధ్య పల్లంగానూ, అంచులవెంబడి ఎత్తుగానూ, ఉన్నదన్నమాట!

జనవరి 19 న వీరు దక్షిణధ్రువాన ఏర్పాటైన అమెరికన్ స్థావరం (అముండ్సెన్—స్కాట్ స్టేషను) చేరుకునేసరికి ఎడ్మండ్ హిలరీ అక్కడే ఉన్నాడు.

700 మైళ్ల పొడుగున హిలరీ రాస్ సముద్రతీరం నుంచి దక్షిణధ్రువానికి గల 1250 మైళ్ల దారిలో ఫూక్స్ ప్రభృతులకోసం ఆహారమూ, నూనే మొదలైనవి అక్కడక్కడా ఏర్పాటు చేశాడు.

ఈ పని జనవరి 4 కు పూర్తి అయింది. తరవాత ఆయన విమానంలో ధ్రువాన్ని చేరుకున్నాడు.

ధ్రువాన నివసిస్తున్న అమెరికనులు ఫూక్స్ బృందానికి ఆప్యాయంగా స్వాగత మిచ్చారు; కొత్తగా వచ్చినవారిని తాము ధ్రువంలో పాతిన జెండాచుట్టూ ప్రదక్షిణ చెయ్యమని, వాళ్లు కాలినడకను భూప్ర



దక్షిణ చేసినట్టుగా చిహ్నాలుకూడా బహూ కరించారు!

తిరిగి 1958 జనవరి 24న ఫూక్స్ బృందం రాస్ సముద్రతీరాన గల స్కాట్ స్థావరానికి ప్రయాణమయారు. కుక్కలతో పనిలేదు గనక వాటిని ముందుగా విమానాలలో పంపేశారు.

ఇప్పుడు వీరికి ప్రయాణం చాలా సులువు. సంబారాలన్నీ దారిలోనే ఏర్పాటై ఉన్నాయి. స్కాట్ స్థావరంనుంచి 700 మైళ్లదూరం వరకూ విమానాలు వస్తూ పోతూ ఉంటాయి. అయినా వీరు ప్రయాణం సకాలంలో ముగించకపోతే పెద్ద చిక్కున్నది. స్కాట్ స్థావరంనుంచి వీరిని తీసుకుపోయే స్టీమరు సముద్రం పేరుకుపోయే లోగా బయలుదేరుతుంది. ఈలోగా వీరు స్కాట్‌స్థావరాన్ని చేరుకోలేని పక్షంలో ఒక శీతాకాలమంతా వీరు స్కాట్‌స్థావరంలో గడపవలిసి ఉంటుంది.

ఇప్పుడు వారు ఉత్తరంగా ప్రయాణిస్తున్నారు. స్కాట్‌స్థావరానికి 700 మైళ్ల దూరంలో హిలరీ ఏర్పాటు చేసిన మొదటి సంబార నిక్షేపాన్ని వారు ఫిబ్రవరి 7న చేరుకున్నారు. వారు షాకిల్టన్ స్థావరంనుంచి బయలుదేరి 1450 మైళ్లు ప్రయాణించినాక వారికి మంచులేని కొండశిఖరాలు మళ్ళీ కనిపించాయి.

వీరు స్కెల్టన్ హిమనదివెంట దిగుతూండగా గంటకు 60 మైళ్ల వేగంతో తుఫానుగాలి సాగింది. దారి అంధకారమైపోయి, వాహనాలు ఎటు పోవలసినదీ తెలుసుకోవటం అసాధ్యమయింది.

ఇందువల్ల వారు డేరాలలో మకాం చేయవలిసి వచ్చింది. ఆఖరుకు 1958 మార్చి 2 అపరాహ్నన ఫూక్స్ బృందం అంటార్కటికా ఖండాన్ని ఈ చివరనుంచి ఆ చివరకు దాటి రాస్ సముద్రంలోని మక్‌మర్డో తీరాన గల స్కాట్ స్థావరాన్ని చేరుకున్నారు.





# వినోదాలు

SANKAR

ఒక వైద్యుడికి పక్షుల వేట అంటే సరదా. ఆయన ఒకనాడు ఉదయమే తుపాకి తీసుకుని పొలాలమీదికి వెళ్ళి సాయంత్రం మళ్ళీ ఆ తుపాకితోనే తిరిగి వచ్చాడు.

"ఏమీ కొట్టినట్టు లేదే?" అన్నది భార్య.

"చాలా పిట్టలను కొట్టాను. ఒక్కటీ చావలేదు మరి," అన్నాడు వైద్యుడు.

"ఎందుకు వచ్చిన వేట? హాయిగా వైద్యం చేసుకోక!" అన్నది భార్య.

* * *

ఒక పెద్దమనిషికి తొలి సంతానం ఒక మగపిల్లవాడు కలిగాడు. ఆయన ఒక మిత్రుణ్ణి వెంటబెట్టుకుని పిల్లవాణ్ణి చూడబోయాడు. నర్సు పిల్లవాణ్ణి తెచ్చి చూపింది.

"మరీ చిన్నసైజుగా ఉన్నాడేమిటి?" అన్నాడు తండ్రి.

"ఇంకా నయం కాదూ? నేను పుట్టినప్పుడు మూడు పౌనులే ఉన్నానుట!" అన్నాడు మిత్రుడు.

"మూడు పౌనులే? బతికావూ?" అన్నాడు తండ్రి ఆశ్చర్యంగా.

* * *

వెర్రాసుపత్రిలో ఒక రోగి డాక్టరుతో, "నేను ఆంధ్ర పాపారాయుణ్ణి. నన్ను వెంటనే వదిలెయ్యండి!" అన్నాడు.

"నువు ఆంధ్ర పాపారాయుడివని ఎవరు చెప్పారూ?" అని డాక్టరు అడిగాడు.

"నాకు దేవుడు చెప్పాడు," అన్నాడు రోగి.

"వట్టిది! నేను ఆ మాట చెప్పనేలేదు!" అని పక్కగదిలోనుంచి మరొక రోగి కేక పెట్టాడు.

* * *

మేస్త్రీ: అందరూ రెండేసి మూటలు తీసుకుపోతుంటే, నువు ఒక్కొక్కటే పట్టుకుపోతున్నావేంరా?"

కూలీ: వాళ్ళు సోమరిపోతులు, సామీ. రెండుసార్లు తిరగాలిసొస్తుందని వాళ్ళు రెండేసి మూటలు ఎత్తుకుంటున్నారు.

* * *

తల్లి: ఎందుకురా అట్లా గెంతుతున్నావు?

కొడుకు: డాక్టరుగారు మందుబుడ్డిని ఆడించి తాగమన్నారు. ఆ సంగతి మరిచిపోయి బుడ్డిలో మందు అట్లాగే తాగేశాను.

# పోలీసు కుక్కలు

శ్రీ ఎన్. కృష్ణస్వామి, ఎం. ఎస్. సి., ఐ. పి. ఎస్. (డిప్యూటీ కమీషనర్, క్రైమ్స్, మద్రాసు)

మన దేశంలో మొట్టమొదటగా పోలీసు అచోకీ నిమిత్తమై కుక్కలను తరిఫీదు చేసినది మద్రాసు నగరంలో. 1951 లో శిక్షణ ఇవ్వ బడిన మొదటి కుక్కలు శామ్, బ్రూటస్‌లనే అల్సేషియన్ జాతి కుక్కలు.

పోలీసుకుక్కలకు ఉండదగిన లక్షణా లన్నీ తగిన మోతాదులో ఉన్న ఆదర్శప్రాయ మైన కుక్కలు అల్సేషియనులే అనాలి. అవి క్రమశిక్షణకు లొంగి, చెప్పినట్టు వింటాయి. పని పట్టటంలో సమర్థత గలవి. అపారమైన ధైర్యం కలిగి తమ యజమాని చెప్పిన పని నిర్వహించటంలో ప్రాణాలను సయితం ఒడ్డ గలవు. అవి మొండిపట్టుదల గలవి, మిన్ను విరిగి మీదపడినా తొణకవు. వీటన్నిటికీ తోడు అవి గంభీరమైన కుక్కలు, యజమా నికి ఆహ్లాదమూ, నేరస్థులకు హడలూ పుట్టించగలవి.

పోలీసులకు కుక్కలు అనేక విధాల ఉపయోగపడతాయి. అవి మనిషికీ, సొత్తుకూ రక్షగా ఉంటాయి. అవి పనికట్టి నేరస్థులనూ, వారు దాచిన సొత్తునూ, నేరం చెయ్యటానికి ఉపయోగించిన సాధనాలనూ వెలికి తీస్తాయి. ప్రస్తుతం కుక్కలను రైల్వేశాఖలోనూ, భార తీయ సైన్యంలోనూ, కస్టమ్స్‌శాఖలోనూకూడా పని చేయటానికి తరిఫీదు నిచ్చి ఉపయో గిస్తున్నారు.

కుక్క అయిదారు మాసాల పిల్లగా ఉండగా పోలీసు పనికిగాను శిక్షణ ప్రారంభ



మవుతుంది. అది ఒకటిన్నర, రెండేళ్లు నిండినది లగాయతు 7 లేక 8 ఏళ్ల వయసు వచ్చేదాకా పోలీసుపనులను దక్షతతో నిర్వర్తిస్తుంది. కుక్కతోబాటు దాని మచ్చికదారుకు కూడా శిక్షణ ఇస్తారు. ఎందుకంటే ప్రతి కుక్కకూ దాని జీవితమంతా ఒకే మచ్చికదారు ఉండటం అత్యావసరం. మంచి జాతి వారసత్వాలు గల కుక్కపిల్లలను నిపుణులు ఎన్నిక చేస్తారు. మచ్చికదారును కూడా జాగ్రత్తగా ఎన్నిక చెయ్యాలి. అతనికి కుక్కలంటే, మీదుమిక్కిలి తన కుక్కపైన, ఆపేక్ష ఉండాలి. అతనికి కుక్కయొక్క తెలివితేటలూ, మన స్తత్వమూ అర్థం చేసుకునే శక్తి ఉండాలి. చేతగానివాడి చేతిలో పడిన కుక్కలు పోలీసుపనికి ఏమాత్రమూ పనికి రాకుండా పోతాయి.

మద్రాసు హార్బరులో అనేక దొంగతనాలు చేసినవాణ్ణి 3-2-53 న "బ్రూటస్" పట్టుకున్నది. పోలీసుకుక్కలు నేరస్థులను పట్టుకోవటానికి ఇదే ప్రారంభం. అదిమొదలు మద్రాసు పోలీసుకుక్కలు ఎన్నో విజయాలను—కొన్ని అద్భుత విజయాలనుకూడా—సాధించాయి.

ఈనాడు మద్రాసులో 9 పోలీసుకుక్కలున్నాయి. అన్నీ అల్సేషియను జాతివే. వీటిలో "యువరాజ్", "చీఫ్" అనేవి తయారయిన కుక్కలు. మిగిలినవి ఇంకా శిక్షణదశలో ఉన్నాయి.

నేరం జరిగినచోటికి కుక్కలు సాధ్యమైనంత శీఘ్రంగా రావటమూ, ఆ స్థలంలో పైవాళ్లు జాస్తిగా తిరగకుండా ఉండటమూ జరిగినట్టయితే కుక్కలు విజయం సాధించ



టానికి అనుకూలంగా ఉంటుంది. ఇతరులు జాస్తిగా తిరగకపోయినట్టయితే నేరస్థుడి "వాసన" నేరం జరిగినచోట 6 నుంచి 8 గంటలవరకూ బలంగా ఉంటుంది. నేరస్థుడి తాలూకు వస్తువు ఏదైనా నేరం జరిగినచోట పడిపోయినట్టయితే, నేరం జరిగిన తరవాత ఎక్కువకాలం గడిచినా కుక్కలు దాని సహాయంతో నేరస్థుణ్ణి పసికడతాయి.

నేరం జరిగిన చాలా కాలానికికూడా కుక్కలు నేరస్థుణ్ణి పసికట్టటం జరగక పోలేదు. రామనాదపురంజిల్లాలోని చొక్కలింగం పుదూరనే గ్రామంలో 17-10-58 రాత్రి దొంగతనం జరిగి 15 వేల రూపాయల సొత్తు హరించబడింది. స్థానిక పోలీసు ఇన్‌స్పెక్టరు పోలీసుకుక్కలకోసం మద్రాసుకు కబురుచేసి అవి వచ్చినదాకా దొంగతనం జరిగిన ఇంటిని తాళంవేసి ఉంచాడు. 20 తేదీన "చీఫ్" వచ్చి పనిపట్టి, దానిని బట్టి 17 మైళ్ల దూరాన గల ఒక గ్రామంలో ఉన్న అలగప్పన్ అనే "కేడీ"ని అత్యాశ్చర్యకరంగా పట్టుకున్నది. పోయిన సొత్తులో చాలాభాగం దొరికింది.

"యువరాజ్" కూడా ఇంత ఆశ్చర్యకరంగానూ ఒక హంతకుణ్ణి పట్టుకున్నది. 17-2-58 రాత్రి మదురజిల్లాలోని శిరుమలై ప్లాంటేషన్‌లోని ఒక గుడిసెలో ఒక కాపలావాడూ, ఆతని భార్యా, కొడుకూ హత్య చేయబడ్డారు. "యువరాజ్" హత్య జరిగిన చోటికి రావటానికి వారం రోజులు పట్టింది. అయినా అది రక్తం వాసనను బట్టి వెళ్లి 6 మైళ్ల దూరంలో ఒకచోట పాతిపెట్టిన ఒక గోనెసంచీని బయటపెట్టింది.

అందులో రక్తసిక్తమైన మారణాయుధాలున్నాయి. పోలీసుకుక్క చేసిన ఈపని కళ్లారా చూసి హంతకులలో ఒకడు మిగిలిన ముగ్గురు హంతకుల పేర్లూ బయటపెడుతూ ఒక ఉత్తరం రాసిపెట్టి, బావిలో పడి ఆత్మహత్య చేసుకున్నాడు!

ఇలాగే "చీఫ్" రాత్రివేళ గస్తీ తిరుగుతూ ఒక నేరస్థుణ్ణి నేరం జరిగిన 2 గంటలలో పట్టింది. "యువరాజ్" ఒక హత్యకేసులో అసలు హంతకుణ్ణి పట్టుకుని అనుమానితుణ్ణి చెర విడిపించింది. అసలు హంతకుడు నేరం ఒప్పుకున్నాడు. చిత్రమేమిటంటే పోలీసులు అరెస్టు చేసిన నేరస్థులు తాము నిర్దోషులమని దబాయిస్తారు గాని, పోలీసుకుక్కలచేత అరెస్టు చేయబడినవాడు తాను నిర్దోషి ననటం ఒక్కసారికూడా జరగలేదు.








# చీమలు

చీమలను చూడని వాళ్లుండరు. మనం నిత్యమూ చూసే చీమలలో చాలా రకా లున్నాయి—ఎర్రచీమలూ, నల్లచీమలూ, రెక్కలచీమలూ, గండుచీమలూ. వీటిలో కూడా చిన్నవీ, పెద్దవీ ఉన్నాయి. నల్ల చీమలు కుట్టవు; ఎర్రచీమల్లో చిన్నవీ, పెద్దవీ కుట్టుతాయి, కాని పెద్దవి కుట్టితే దద్దుర్లెక్కి చాలా బాధపెడుతుంది; గండు చీమలు కుట్టవు గాని పీకుతాయి, ఇవి పీకిన చోట రక్తంకూడా వస్తుంది.

ఇంచుమించు ప్రతి దొడ్డిలోనూ చీమల పుట్ట లుంటాయి. అవి నేలలో ఉంటాయి. చూడక మనం వాటి పుట్టమీద కాలువేస్తే మనని కుట్టేస్తాయి. అవి మనకు ఇళ్లలో కూడా కనిపిస్తాయి. గోడ కన్నాలలోనూ, నేల పగుళ్లలోనూ అవి ఉండటం మనం చూస్తాం. వాటికి పనికివచ్చే ఆహారం ఎక్కడ ఉన్నాసరే అవి క్షణాలమీద తూగిడీలుగా వచ్చి అక్కడికి చేరుతాయి. ఇంతకంటె మనకు చీమలను గురించి ఏమీ తెలియదు. కాని వాటిని గురించి తెలుసుకోదగిన అంశాలు అనేకం ఉన్నాయి. ఈ విషయాలను ఎందరో పరిశీలకులు గమనించారు.

ఏ ఒక ప్రాంతంలోనైనా కొన్నిరకాల చీమలే ఉంటాయి, కాని ప్రపంచం మొత్తం మీద 8 వేల రకాల చీమలున్నాయి. ఒక్క బెల్జియన్ కాంగోలోని చీమలను గురించి 1139 పేజీల గ్రంథం ఉన్నదట!

చెదలు చీమలు కావు, కాని కొందరు వాటిని తెల్లచీమ లంటారు. శాస్త్రరీత్యా చీమలు కందిరీగల, తేనెటీగల విభాగానికి చెందినవి, చెదలు బొద్దింకల విభాగానికి చెందినవి. అయితే చెదలు తమ జీవిత విధానాలలో చీమల పోలికలు చాలా అలవరుచుకున్నాయి.





కొన్నిరకాల చీమలు నౌకలలో ప్రవేశించి ఇతర దేశాలకు వలసవెళ్లాయి. ఈవిధంగా ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకూ వలస వెళ్లిన చీమల జాతులున్నాయి.

భూమిపై 30 లక్షల ఏళ్లక్రితం జీవించిన చీమలనుకూడా మనం ఈనాడు చూడ వచ్చు. ఆ కాలంలో ఉండిన దేవదారు వృక్షాల బంకలో ఈ చీమలు చిక్కుకు పోయాయి. ఆ బంక ఇప్పుడు మనకు తృణ మణి రూపంలో దొరుకుతున్నది. తృణమణి గాజులాగా ఉంటుంది గనక దాని లోపల ఉండే చీమను మనం చూడవచ్చు.

భూమిపైన ఉండే చీమల సంఖ్యను మనం ఊహించలేం. ఏ ఇతర జీవరాశి కూడా అంత సంఖ్యలో లేదని చెప్పవచ్చు. చీమలలో సాముదాయిక జీవితం ఉన్నది, వాటికి ఒక "నాగరికత" ఉన్నది, అవి ఉత్పత్తి చేస్తాయి, యుద్ధాలు చేస్తాయి. ఒక్కొక్క రకం చీమలకు ఒక్కొక్క వాసన ఉంటుంది. చీమలు తమ వాసన లేని ఇతర చీమలతో హెూరాహెూరి యుద్ధాలు చేయగలవు, వాటి "నగరాల"పై దురా క్రమణ చేయగలవు. అనేక విషయాలలో వాటి జీవితవిధానం మానవ జీవితాన్ని స్ఫురింపజేస్తుంది.

వాన కురిసిన మరునటిరోజు మనం దొడ్డి లోకి వెళ్లి ఏదైన రాయిని ఎత్తినట్టయితే దాని కింద అనేక చీమలు కనిపించవచ్చు. అవి అటూ ఇటూ చెల్లా చెదరుగా పరిగెత్తుతాయి. ఇవి పనిచేసే చీమలు—"శ్రామికులు" వీటి మధ్యలో పెద్ద ప్రమాణం గల చీమ కనిపించినట్టయితే అది "రాణి". "రాణి" ఆడచీమ, మిగిలిన చీమలన్నీ దాని సంతానం. "శ్రామికులు" అభివృద్ధి చెందని ఆడచీమలు. మగచీమలు చాలా చిన్నవిగా ఉంటాయి. ఆడచీమలకు గర్భధారణ జరిగే తరుణంలో తప్ప అవి పుట్టలలో కనిపించవు.








### "వలస వెళ్లే రాణి"

భవిష్యత్తులో "రాణి" కాబోయే చీమలకు "పుట్టింట" చాలా సౌకర్యాలుంటాయి. దానికి మిగిలిన చీమలు ప్రత్యేకమైన ఆహారం ఇచ్చి, గారాబంగా పెంచుతాయి. అది బాగా పుష్టిగా ఉండి చాలా ఆహారాన్ని తనలో ఇముడ్చుకుంటుంది. దానికి రెక్కలుంటాయి, వాటిని కదిలించే కండరాలు బాగా పెరిగిఉంటాయి. గర్భధారణ కాగానే రాణి తన "పుట్టింటిని" వదిలి ఎగురుతూ వెళ్లి వేరొకచోట నివాసం ఏర్పరచుకుంటుంది.

ఇలా ఎగిరి వెళ్లినాక దానికి రెక్కలతో పని ఉండదు.

రాణి ఏ చెట్టుబెరడు వెనకనో, రాయి కిందనో సందు చూసుకుని అక్కడ తనకూ, తనకు కలగబోయే పిల్లలకూ నివాసం ఏర్పాటు చేసుకుంటుంది. ఒక్కొక్కప్పుడు అది చెట్టుబెరడు నమిలి దానితో కాగితం లాటిది తయారుచేసి దాని చాటున వసతి ఏర్పాటు చేసుకుంటుంది. ఇక రెక్కలతో పనిలేదు గనక వాటిని రాల్చేస్తుంది, లేదా కొరికి పారేస్తుంది. వాటిని కదిలించే కండరాలు దానికి అదనపు ఆహార నిలవగా ఉపయోగిస్తాయి.

తరవాత "రాణి" మొదటి విడత గుడ్లు పెట్టి పిల్లలను చేసి, తన పొట్టలో ఉన్న ఆహారాన్నే వెలికి తెచ్చి వాటికి తినిపిస్తుంది. మొదటి విడత పిల్లలు దుర్బలంగా, గిడసబారి ఉంటాయి. అయినా వాటికి ఆహారం తీసుకురావటం తెలుసును. అవి తమ తల్లికీ, తమకూ, విడతలు విడతలుగా పుట్టుకువచ్చే చెల్లెళ్ళకూ కావలిసిన ఆహారాన్ని వెతికి పట్టుకొస్తాయి.

ఆనాటినుంచీ పిల్లలు వెతికి తెచ్చే తిండి తింటూ కదలకుండా కూచుని వరసగా పిల్లలను పెట్టటం తప్ప "రాణి"కి మరొక పని ఏమీ లేదు.

అయితే "రాణి" చీమలు కొత్త నివాసాలు ఏర్పరచుకోవటంలో కొద్దికొద్ది తేడా లున్నాయి. ఆసియాలోనూ, ఉత్తర ఆఫ్రికా లోనూ ఉండే ఒకరకం చీమలలో "రాణి" కొత్త నివాసం ఏర్పాటు చేయటానికి వచ్చే టప్పుడు దాని కాళ్లను నోళ్లతో కరుచుకుని "శ్రామిక" చీమలు కొన్ని వెంట వస్తాయి. కొత్త "గూడెం" తాలూకు పనులన్నీ అవీ చేస్తాయి.

కొన్నిరకాల "రాణి" చీమలు "పని వాళ్ళను" వెంట తెచ్చుకోవు, తమ మొదటి విడత పిల్లలను తాము సంరక్షించనూ లేవు. అందుచేత అవి ఇంకొక జాతి చీమల పుట్ట పైన దాడిచేస్తాయి. ఈ దాడులు చిత్ర విచిత్రంగా ఉంటాయి. ఒకరకం రాణి చీమ తన జాతికి సన్నిహితమైన మరొక జాతికి చెందిన చీమలపుట్టలో ప్రవేశించి అక్కడ ఉన్న గుడ్లన్నిటినీ పోగుచేసి లాగేసుకుని, అక్కడి చీమలతో పోట్లాడుతుంది. ఆ గుడ్ల నుంచి వచ్చే చీమలన్నీ తమను తస్కరించిన "రాణి"కి విధేయత కలిగి ఉంటాయి. అవి "రాణి"కీ, దానికి పుట్టే పిల్లలకూకూడా సేవచేస్తాయి. ఇలాటి పుట్టలలో రెండు రకాల చీమలు కలిసి జీవించటం జరుగుతుంది.

"ఫార్మికా" అనే జాతి చీమల "రాణి" చాలా చిన్నది. దీని శరీరంనిండా మందంగా పసుపుపచ్చ నూగు ఉంటుంది. ఇది కొత్త కాపరం పెట్టటానికి బయలుదేరి తనకు సన్నిహితమైన మరొకరకం చీమల పుట్టలో ప్రవేశించి, ఎలాగో అక్కడి "పనివాళ్లను" కూడగట్టుకుంటుంది. ఆపైన ఆ "పనివాళ్లు" తమ సొంత తల్లిని హత్యచేసి ఈ కొత్త రాణికీ, ఆమె సంతానానికీ ఊడిగం చేస్తాయి. కొద్దికాలంలోనే ఆ పుట్టలో ఉండిన పాత రకం చీమలన్నీ చచ్చిపోయి, పుట్ట కొత్త చీమల "ఆస్తి" అవుతుంది.

—(ఇంకా వుంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ముక్కుమీద గుద్దితే...

రెండవ ఫోటో : మూతిపళ్ళు రాలునా?

పంపినవారు : శ్రీమతి ఎస్. శారదాదేవి,
దేవళంవీధి, కదిరి. (అనంతపురం జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలోకి వెళ్ళి కాయలు కోసుకుని, వెంట తెచ్చిన సంచీపక్కన వాటిని పెట్టి ఆడుకోసాగారు. ఆ సమయంలో వాళ్ళకు తోటలో ఒక మూలనుంచి చిత్రమైన అరుపు వినబడింది. అది ఏమిటా అని వాళ్ళు ఆ వైపుకు వెళ్ళేసరికి, అలా అరిచిన కొంటెకుర్రాడు మరోవైపుగా తిరిగివచ్చి, దాసూ వాసూలు కోసిన కాయల్ని తీసుకోబోయాడు. పక్కనే వున్న పొదలో దాగివుండి, యిదంతా చూస్తున్న 'టైగర్' మెల్లిగా ఖాళీసంచీలో దూరి, కొంటెకుర్రాడి మీదికి చెంగున ఎగిరింది. సంచీలో వున్న 'టైగర్'ని చూడని కొంటెకుర్రాడు, ఈ వింత చూసి బెదురుకుని, కాయల్ని వదిలి తిరిగి చూడకుండా పారిపోయాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## బిన్నీవారి కాట్స్‌వాల్

ఆశ్చర్యకరమైన బట్ట, రాత్రిపూట వెచ్చగా ఉండి: పగలు హాయినికలిగిస్తుంది

కాట్స్‌వాల్ సాటిలేని విలువకలది; కారణం...

అతి జాగ్రత్తగా, శాస్త్రీయమైన పద్ధతులలో శ్రేష్ఠమైన పున్ని. నూలు కలిపి అది తయారుచేయబడింది.

చాలకాలం మన్ని మెత్తగా, మృదువుగా వుంటుంది, ప్రత్యేకించి పాపలకు, పిల్లలకు తగినది. మృదువైన చర్మానికి ఎంతమాత్రం హాని చేకూర్చదు. చట్టువకల్గే ఉష్ణోగ్రత మార్పులకు రక్షణకలిగిస్తుంది. ఎప్పుడూ కళ్లు జిగేల్‌మనేటట్లు అందంగాను ప్రతి కాలానికి తగినట్లుగా వుంటుంది. ఇంటిలోనే ఉతుక్కోవచ్చు.

కాట్స్‌వాల్ తీసిపోదని హామీ యిస్తున్నాము

రకరకాల రంగులు అద్దకాలు చెక్కులు మరి టార్టానులలో మీకు నచ్చినవి తీయండి.

కాట్స్ వాల్‌ను పోలినదిలేదు.

ఎక్కువ వెచ్చదనానికి బిన్నీవారి హెవియర్ ఊల్ మరి నూలు బట్ట- అంగోలా ధరించండి. ముద్దులొలికే పలురంగులు.





రోజంతా హాయిగా జలజల్లాడు తూంటారు



చలిపెట్టే రాత్రులందు వెచ్చదనం కలిగిస్తుంది




మా అనుమతిపొందిన ఏ వర్తకుని వద్దైనా కాట్స్‌వాల్ మార్క్ గమనించి మీకు కావలసిన కాట్స్‌వాల్ కంట్రోలు రేటుకు కొనండి

ది బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ, లిమిటెడ్.
అగ్రహారం రోడ్డు, బెంగుళూరు 2
మేనేజింగ్ ఏజంట్లు: బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్







PRASAD
PROCESS

పిల్లలారా! త్వరితంగా...దీనిలో...పాల్గొనండి

# సన్‌లైట్ రంగులువేసే పోటీ

# రు. 25,000

విలువైన వందలకొలదీ గొప్ప బహుమతులు!

**రెండు మొదటి బహుమతులు:** రు. 4,000/- రొఖము లేదా అంతవ్యయముతో భారతదేశమంతటా విలాస విహారము!

**నాలుగు రెండవ బహుమతులు:** హెచ్.ఎమ్.వి. రేడియోగ్రామ్!

**ఆరు మూడవ బహుమతులు:** మర్ఫి ఆల్ వేవ్ రేడియో యున్నదానితోపాటు హింద్ అంబాసెడర్ సైకిల్!

**2000 ప్రోత్సాహక బహుమతులు** పెయింటింగ్ సెట్ లేదా ఒక బొమ్మ!

బాలబాలికలారా, ఈ ఉత్సాహకరమైన పోటీలో పాల్గొనండి! ఈ గొప్ప పోటీలో సులభంగా ఉత్సాహకరమైన బహుమతులను గెలవండి! మొట్ట మొదట సన్‌లైట్ అమ్మే మీ దుకాణదారు వద్ద ఉచితంగా ప్రవేశపత్రములను తీసుకోండి. ప్రతి ప్రవేశ పత్రమందునూ ఒక సొగసైన చిత్రమున్నది. మీరు చేయవలసినదల్లా ఇంతే, దానికి రంగులు వేయండి... మీ కిష్టమైన ఏరంగులతోనైనా సరే!

ఈ పోటీ వయస్సువారీగా రెండు గ్రూపుల ప్రవేశము నిమిత్తం నియమింపబడింది. (1) పది ఏళ్లలోపు వయస్సు వారు. మరియు (2) 10,15 ఏళ్ల మధ్య వయస్సువారు. రెండు గ్రూపుల వారి చిత్రములన్ను వేర్వేరుగా పరిశీలింపబడి నిర్ణయింపబడును. ఒక వయస్సు గ్రూపునందు మొదటి, రెండవ, మూడవ బహుమతులను మరియు ప్రోత్సాహక బహుమతులను గెలుపొందిన వారికిచ్చే బహుమతులే మరియొక గ్రూపు యందలి గెలుపుదారులకు కూడా ఇవ్వబడును.

ముగింపు తేదీ: నవంబరు 16, 1959

పిల్లలారా! త్వరపడండి!
మీ ప్రవేశపత్రములను నేడే తీసుకోండి!






కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతుకును!

S/10-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి.



# అధిక పంటలకు ప్రోత్సాహం

ఈనాడు ఎక్కువ పంటలు పండించి, దేశ సౌభాగ్యానికి తోడ్పడవలసిన అవసరం ఎంతైనా వుంది.

మా 'కమలం' మార్కు 'మిశ్రపు ఎరువులు' ఇందుకు ఎంతో తోడ్పడుతవి.

అన్ని ఋతువులలో, అన్ని పంటలకూ అవసరమైన ఎరువులు మావద్ద ఎల్లప్పుడూ లభిస్తవి. తోటలకు కావలసిన ఎరువులను కోరిన విధంగా అందజేయుగలము.

ఉచితముగ మేమిచ్చే సలహాలను పొంది, మీ భూములను సారవంతము చేసుకోండి. ఇందువల్ల తప్పక సుభిక్షమైన పంటలు పండుతాయి. అధిక పంటలు రూఢిగా పండించి, మీరు దేశ సౌభాగ్యానికి తోడ్పడగల్గుతారు!

సూపర్ - ఫాస్ఫేటును ఎల్లప్పుడూ మేము అందజేయుగలము.

ఎరువుల విషయంలో మమ్మల్ని సలహా చేయండి!



## ది మైసూర్ ఫర్టిలైజర్ కంపెనీ

31-ఎ, నార్తుబీచ్ రోడ్డు :: మద్రాసు - 1

---

# అనేక సంవత్సరములుగ

డి. డి. టి., బి. హెచ్. సి., లిన్డేన్, క్లోర్డేన్, ఎన్డ్రిన్ మొదలైనవి
ఆధారంగా వృక్ష క్రిమిసంహారకములున్ను,
హెప్టక్లోర్, రాగి, గంధకము మొదలైనవాటిని అనుసరించి — పంటల
నాశనకారులైన బూజు తెగుళ్ళను తొలగించే సాధనాలనూ,
దక్షిణ ఇండియాలోని మద్రాసు, కుప్పం ( ఆంధ్రరాష్ట్రం )
ఫ్యాక్టరీలలో తయారుచేస్తున్నాము.



పూర్తి వివరాలకు:

## ది మైసూర్ ఇన్సెక్టిసైడ్స్ కంపెనీ

31-ఎ, నార్తుబీచ్ రోడ్డు :: మద్రాసు - 1

సంతోషదాయకమైన ఈ దీపావళీ
పర్వకాలమున అందరకూ మా
స్నేహపూర్వకమైన శుభాకాంక్షలు



# పి. మునిరత్నం నాయుడు & సన్సు

కాగితములు, స్టేషనరీ వ్యాపారులు

స్థాపితం: 1913

10, స్ప్రింగర్ స్ట్రీట్ :: మదరాసు_1.

ఫోన్: 55213

తంతి: "STATIONERS"

హెడ్డాఫీసు:

వేలూరు

# పండగకి నీకేంకావాలి?

అని మీ నాన్న అడిగితే.......

## ఏమేమడుగుతావ్?




అసలు ముందర ఈ కథ విను–

మొదటేమో **'పేపరు పాపాయి'** వచ్చాడు  వీడేమో గాలిలో ఎగురుతూ ఎన్నెన్నో వింతలు చూసివచ్చాడు అవన్నీ రంగు రంగు బొమ్మలతోటి  మీకు చూపిస్తాడు. వీడి కథ ఎంత బావుందంటే దానికి కేంద్ర ప్రభుత్వం బహుమతి ఇచ్చింది.

... తరవాత **'వేటగాడి కొడుకు'** వచ్చాడు వాడికి కడుపునిండా కథలే! అన్ని దేశాల కథలూ భలే గమ్మత్తుగా చెబుతాడు. అవును గానీ నువ్వు ఎప్పుడేనా బీచ్ చూశావా? **'మద్రాసు బీచిలో ఒక సాయంకాలం'** షైరుకెడితే మరేం-ఎంత బావుంటుందో! కార్లు-బొమ్మలు-బటాణీలు-బెలూన్లు! –కావాలంటే ముందర ఈ పుస్తకం చూడు. చవక కూడాను! రూపాయన్నరేనుట! మీనాన్నకి చెప్పు. **'పేపరు పాపాయి'** **'వేటగాడి కొడుకు'** కూడా ఒకొక్కటి రూపాయిన్నరేలే..

ఇంకో మాంచి పుస్తకం పేరు **'రాజా-అడవిఎనుము'**




ఓ పెద్దపులీ ఓ ఎనుమూ ఎలా స్నేహం కట్టాయో ఆ తమాషా కథ రంగు రంగు బొమ్మలతో దీంట్లో వుంది. దీని వెల 90 నయాపైసలే!

ఈసారి పండుగకి ఏంకావాలని మీనాన్నడుగుతే (కొత్త బట్టలు ఎలాగా కుట్టిస్తాడు కనక) పుస్తకాలని చెప్పు. ఏ పుస్తకాలంటే ఈ నాలుగు పుస్తకాలూ అని చెప్పు. ఇవన్నీ **దక్షిణభాషా పుస్తకసంస్థ** సహకారంతో అచ్చువేశారు. మీ వూరి బుక్‌షాప్‌లో దొరుకుతాయి. లేకపోతే ఈ అడ్రసుకు రాయచ్చు




**"ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్" రాష్ట్రపతిరోడ్, సికందరాబాద్.**

# ఇది చదివితే మీరు ఆశ్చర్య పడతారు...



రాజాలకు చాలామంది శత్రువులుండే కాలంలో, వారి స్వప్రాణ రక్షణ గొప్ప సమస్యయివుండెను. చీనా దేశ చక్రవర్తి, ఓ. ఫాంగ్ తన శత్రువులను కని పెట్టుటకు అతి చమత్కారమైన విధానమును ప్రయోగించియుండెను. తన కోటయొక్క సింహద్వారమందు లోపల ప్రవేసించే నిమిత్తం సూదంటురాతితో నిర్మించబడిన వలయాకారపు ద్వార ముండెను. ఆయుధాలను దాచుకొని ఎవరైనా వస్తే వెంటనే పట్టుబడేవాడు. తక్షణం ఆయుధములు బయల్పడేవి. ఈనాడు, కంటికి కనిపించనట్టి దేనినైనా చూపగలిగి కనిపెట్టగలుగునట్లుచేసే ఎక్స్-రేలువంటి తదితర పద్ధతులున్నవి. ఆ విధంగా వ్యాధులు కనుగొనబడుచున్నవి.



ఎక్స్-రేలు, వ్యాధికి సరియైన కారణమేమిటో డాక్టర్లు కనుక్కోగలిగి అందువల్ల ఆ వ్యాధులను గలిగించే క్రిములను వారు పరిశీలింపగలుగునట్లు చేయుచున్నవి. అయితే, క్రిములు ప్రతీచోటా వున్నవి; పనియందైనా లేక ఆటలోనైనా— మన మేమిచేయుచున్ననూ ప్రతీరోజూ మనకు అంటకుండా తప్పించుకోజాలనట్టి మురికిలో అవి దాగియున్నవి. ఈ క్రిములు వ్యాధిని గలిగించును. కాని, మీరు లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానముచేయుటవల్ల మీ ఆరోగ్యమును కాపాడుకోవచ్చును.






అది మురికిలోనున్న క్రిములను కడిగివేయును. లైఫ్‌బాయ్‌తో రోజూ స్నానముచేయండి. అది మీకు ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారీ.

L/211-50 TE

Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూతి పళ్లు రాలునా ?

పంపినవారు :
ఎస్. శారదాదేవి - కదిరి

